శ్రీ ర స్తు.

# శ్రీమద్భాగవత మహిమ.

## వి ష య సూ చి క.

పంచమాధ్యాయము.



షష్ఠాధ్యాయము.



ఉభయభాషా ప్రవీణ, వేదాంతపారీణ

మిన్నికంటి గురునాథశర్మ

# మనవి.

సోదరాంధ్రులారా!

శ్రీమద్భాగవత మాహాత్మ్యము పద్మపురాణోత్తరఖండమునఁ గలదు. సంస్కృతము రానివారికది యసుంబితము. కాన భగవదనుగ్రహమున దాని నాంధ్రీకరించితి. పూర్వులు త్రొక్కిన యనువాద పద్ధతి ననుసరించితి. అన్ని యెడల మక్కికి మక్కిగాక కొన్నియెడలఁ బదము నుపలక్షించియుఁ గొన్నియెడల భావము పరికించియుఁ గొన్నియెడలఁ గ్రొత్తలు చేర్చియు దీనిని రచించితి కథలలో స్వాతంత్ర్యించియు మూలోద్దిష్ట భావము చెడకుండ వ్రాసితి. వర్ణనలు స్వీయములే. మహిమానువర్ణనమున మాత్రము ప్రమాణబుద్ధికై మూలమును దొలఁగలేదు.

సప్తాహ యజ్ఞమున దినమున కెంతవఱకుఁ జదువవలయునో యది మూలమున లేదు. కాన శిష్టాచారము ననుసరించితి.

"శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే... యథాంతరం నపశ్యామి" అని నిత్యము స్మరించుచు హరిహరుల కభేదంబను తత్త్వమెఱింగి నాగ్రంథము నాపరతత్త్వమున కొప్పగించితి.

తాము రచింపనెంచి తెప్పించుకొనిన పుస్తకము నాకొసంగి వ్రాయ నాదేశించిరి, యోగవాసిష్ఠము నాంధ్రీకరించినవారు, పరమబ్రహ్మణ్యులు, బ్రహ్మశ్రీ మద్దూరి సాంబయ్యగారు. ఈనామిత్రుని మహోపకృతి చిరస్థాయి గదా. వారికి నాకై మోడ్పులెన్ని యర్పింపవలయునో. గ్రంథమచ్చుపడుట తిలకించిరి. సాదరమున తమూఁ –అని "విభూతి" పెట్టి "భాగవత మహిమ" ను వెల్లడించిరి. శ్రీ సాహిత్యాచార్య, లాక్షణిక శిరోమణి, విద్యా ప్రవీణ, భాషా ప్రవీణ– బ్రహ్మశ్రీ జమ్మలమడక మాధవరామశర్మగారు – వారి సహృదయతకు మన్నమోవాకములు.

ఈమహిమను జదువుఁడు. గుణమున్న నానందింపుఁడు. లేదేని భగవత్స్మరణ ఫలము లభించును. కాలము దుర్వ్యయము చేయుట మాత్రము కాదు.

గుంటూరు
ఖర పుష్యకృష్ణనవమి

శర్మ.

# విభూతి.

శ్రీ మిన్నికంటి గురునాథ శర్మ గారు నియతిస్వీకృత భక్తియుక్తులు, నియమారాధిత సారస్వతేయులు, ప్రకాశిత కవితా ప్రకాశులు, ఉత్తీర్ణోభయభాషా ప్రవీణ పరీక్షులు, శ్రీ కళ్యాణ దేశిక చరణ చరణ సీమాంత సమధిగత వేదాంతపారీణ పదాంకులు, అధీతి బోధాసక్తులు. ఈ "భాగవత మహిమ" గ్రంథమును రచించిరి. ఇట్టి వారి కీకృత్యము సముచితము కదా! ఇది స్వతంత్ర కృతి కాదు. శ్రీ పద్మపురాణోత్తరఖండము లోని భాగవత మాహాత్మ్య ప్రతిపాదక మయిన యధ్యాయషట్కమున కనువాదము. అందలి శ్లోకసంఖ్య ౫౦౮. ఇందలి గద్య పద్య సంఖ్య ౭౧౫. అట నట కవి కూర్చిన కొన్ని వర్ణనము లధికములు. అది కవి కవితాసక్తి కొక చుక్క. గురునాథశర్మ సాత్త్వికు డయిన భక్తుడు. మూలమున లేదని యూరకొన జాలడు, అయా ఘట్ట ప్రఘట్టములలో నార్ద్రార్ద్రమయిన కవిచిత్త మట్లు చేయింపక మానదు. ఈ మహిమ నా చేతి కందినది. హృదయమున కందుకొంటిని. నా భాగవతభావము భాగవత మహిమను భావింప జేసినది. నేనేమి చేయుదును? భావించితిని, సంస్కృతమును సంభావించితిని, ఇంకను పరిభావనము చేసితిని. ఒక యనుభూతి పొందితిని, తద్వివృతికై యీ విభూతిని సంతరించితిని. పాఠక భ్రాతల కిది ప్రముఖ సంభావ్యము కావలెనని కాంక్షింతును.

కవులకు దైవికావభాస ముండునని మనకు కతలలో కైతలలో మాత్రము తెలియును. మిన్నికంటి కవి కది యనుభవమున తెలిసినది. కవితాత్ముడు భక్తిభావు డిది విశ్వసించును. కవి లోకవిషయమున సందిహానుడయ్యెను. "దాని నెల్లవారు నమ్మకున్నను సత్యము చెప్పెద" (పుట 3.) నని చెప్పెను. కొంతయు చెప్పెను. మిన్నికంటి గురునాథశర్మ గారికి స్వప్న దర్శనము లభించినది. నందీశ్వర దివ్యదర్శనమును లభించెను. ఆనందమును లభించెను. పాఠకుల కీ మహిమ లభించినది.

శ్రీ మద్దూరి సాంబయ్య గారు భక్తులు భావుకులు కవులును. వారే దీని నేల ఆంధ్రీకరింప లేదు? అది చిత్రఘటనము వీరిట్లు చేయవలసి యున్నది. వారు చేయ లేదు. వీరు చేసిరి. నవమి కొక విశిష్టత యున్నది. అది కవికిని అనుభూతిలో గోచరించినది. నవమి సంకల్పము. మాసములో

సిద్ధ మయినది. ఇట్టి శక్తివిశిష్టతలు వాచ్యములు కారాదు. కాని గురునాథ శర్మ కవి. కవు లూరకొనరు. బయలు చేసి కాని యూరట పొందరు.

కవి హరిహరనాథ భక్తుడు. తిక్కన సోమయాజి హరిహరనాథ ప్రస్తుతుడు. తిక్కన కవితాభిమానము గురునాథు నిట్లు చేసినదా? ఆయిన గావచ్చును. ఇంక నొకటియు గావచ్చును "శ్రీ శంకరుల లోని పార్శ్వ నాథుని ఛాయలు హరిహరనాథునిలో నున్న" వని చరిత్రజ్ఞులు తలచిన కతమున. తత్త్వము లిట్లుండ తలంతురు ఆంధ్రబ్రాహ్మణులలో గొందరు శైవధర్మమును కేవలబ్రహ్మమును గాక ధర్మబ్రహ్మ యోగ మవలంబించిరి. లోకాత్మ సంగ్రాహకు లయిరి. వారు నియోగి బ్రాహ్మణులు. ధర్మబ్రహ్మ యోగ సంప్రదాయము తిక్కయజ్వ నాటనుండి సముల్లసిత మయినది ఆ బ్రాహ్మణ సంప్రదాయమున హరిహరనాథు డారాధ్యుడు తిక్కన కవితారాధకులకును హరిహరనాథు డారాధ్యుడు గురునాథ కవి కన్ని విధముల హరిహరనాథు డారాధ్యు డయినాడు. ఈ మహిమ వెల్వడినది.

కవితకై గ్రంథము కలనము చేయుటేమి, విషయసంపత్తికై వెలయించుటేమి రచయితల యాచారము. ఆ గ్రంథములు కాలచక్రమున తిరుగుళ్ళు పడి కవితాస్వాదనమునకో విషయసంపదనుభూతికో యయినవి. కవితకె గుర్తింపు వారలకు విషయగతి దూరమయినది. విషయ మవగాఢము చేసికొను వారికు కవిత కమనీయము కాక పోయినది. ఈ ప్రాతిస్వికదృష్టి మన తెలుగు గ్రంథముల వెలుగును సరిగ వెల కట్టినది కాదు. ఈ భాగవత మహిమ కవితలో విషయ మిచ్చి, విషయమున కవిత నిచ్చి యుభయమిశ్ర మగుట యాశింతును. అప్పుడు గురునాథ సంకల్పమును సంకల్పము కాగలదు. కొన్ని వస్తువిశేషములు స్వాభావికముగా కవితల కాత్మ నర్పించును. కొన్ని కవితలు వస్తువున కమ్మడు పోవును. పౌరాణికములందీ ద్వితీయము ముద్ర నిడుకొన్నది. అది యసంగతమును కాదు. కైతల కైపులో వస్తువు వక్ర మగుటను ఎట్టిరును కోర రానిది. ఈ మహిమ రూఢ మయిన వస్తువు అదుష్టరచన కూడి సువర్ణప్రత్యుప్త స్ఫుర్యత్నమ రత్న మగును. సంస్కృతము నందలి రచన యంతయు నేకవృత్తక మయిన రచన. ఇందలి రచన భిన్నభిన్న స్వరూపము. గద్యపద్యాత్మకము, ఇది తెలుగుల పరిచితి. ఏకవిషయమునకు ఏకచ్ఛందము సముచిత మని సాంస్కృతికులు తలచిరి. తెలుగుముఖు లట్లు తలచ లేరు. భిన్నచ్ఛందోగతులలో కూడ

ఆక్షేప్య విషయసూత్రమును వారనుసంధించిరి. గురునాథశర్మ గారి యనుసంధానము ప్రఘాతము లయిన పద్యములలో ప్రసన్నముగా సాగినది. ఈ కోమలశయ్యా సేవ్యకృతవస్తువుల కుపాదేయ మగుట సారస్వతేయుల కభినందనీయము.

ఇది కావ్యమా? పురాణమా? కావ్యము పురాణము కాదా? పురాణము కావ్యము కాదా? కావ్యఫలము లందు ధర్మప్రతిబోధనమును గలదు. ఇది మానవధర్మమును బోధించు కావ్యము. మానవుడు జనుఃసాఫల్యమునకై భక్తిభావము కలవాడు కావలయును. దాని నిది సూచించును. భక్త్యుద్బోధము ముఖ్యముగా నిం దితరభావములు తగిన యంగభావము పొందినవి. "పాపబహుళ మయిన కలికాలమున భాగవతము మానవుల కుపకరించును" "అది భుక్తి ముక్తి దాయకము" ఈ యంశమును ముఖ్యీకరించుకొని యీ గ్రంథ మిట్లింత యయినది. ఇది మూలతత్త్వము. శుష్కముగ జెప్పిన వినరు. వినుట కనుకూలముగ జెప్పవలయును, దృష్టాంతముల నిరూపింప వలయును. కథల వ్రాయ వలయును సాక్ష్యము చూప వలయును. సంప్రదాయము ప్రదర్శింప వలెను. ఇవి యిట్టివి యుపాయములు, అనుపానములును అవి యిందున్నవి. కథతో కలసిన తత్త్వ మిందు ముఖ్యము. వెన్నతో పాదిపిన మందిది. వెన్న లేకున్న చిన్నివాడు మందు తినడు, మందు డగును. కథలున్న తత్త్వమును కామినులును కబళింతురు, కథ ప్రతిపాద్య ప్రశంసాపరము. ఇట్లగుట అది యచారిత్రిక మని యప్రమాణ మని కాదు. ఆ యా కథల కాల చరితములును మహామాంతమున నుండనే యున్నవి. ఈ భాగవత మాహాత్మ్యము పద్మపురాణములోనిది. స్కాందములో భాగవతమాహాత్మ్యము కలదు. కూర్మము నందు కలదు. ఇతరము లందును కలదు. చారిత్రికుల కాలదృష్టిలో నీ కథ లెట్టి వయిన నేమి? అన్నియు ప్రతిపాద్యమును ప్రతిపాదించును. శ్రీ గురునాథ రచన వివక్షిత ప్రతిపాదనమునకై ప్రసరించినది.

అసలు భాగవతార్థ మేమి? ఈ యంశమున కిచట అధికప్రసక్తి తగదు. అప్రసక్తియు క్షంతవ్యము కాదు. భూమవిద్య పొంద గోరిన నారదుడు సనత్కుమారుని సమక్షమున తన తెలివిడిలో నితిహాసములను పురాణములను జెప్పెను. ఈ పురాణేతిహాసము లా పురాణేతిహాసముల ఛాయలు కావని యభారతీయు లందురు. భారతీయు లందరిలో జేరని కొందరు

నట్లై యందురు. కాని యంద రది వినరు. ఆ యనుట యకించిత్కరము మహాపురాణములు, ఉపపురాణములు, అతిపురాణములు, పురాణములు అష్టాదశాష్టాదశ సంఖ్యతో నున్నవి. ఈ భాగవత మే వర్గమున జేరిన నేమి? ఇట్టి వన్నియు నవాంతరములు. భాగవత ప్రతిపాద్య తత్త్వము శ్రీకృష్ణ పరబ్రహ్మ భగవానుడు. పురాణము పంచలక్షణ మగుట ప్రసిద్ధమే. అన్నియు నిం దున్నవి. అయినను భాగవతమున ప్రతిపాద్యాశ్రయ తత్త్వము శ్రీకృష్ణభగవానుడే. భాగవతార్థమును వ్యాఖ్యాత లనేక విధముల జెప్పిరి. అభిరుచి విశేషముల ప్రదర్శించిరి ఈ మహిమయు భాగవతార్థమునె చెప్పును. ఈ షడధ్యాయి భాగవతమునకు పీఠిక. భాగవతము వేదసార మని మంత్రరూప మని మహిమ నిరూపించును అందునను భాగవత పారాయణవిధి ప్రతిపాదిత మయినది. మహారాష్ట్ర వ్యాప్త మయిన నాధభాగవతము భాగవతమును తన దారిలో పెట్టును, చైతన్య పథమునే భాగవత దీపము చూపు నని వంగ వైష్ణవు లనుట లే దేమి? పురాణతత్త్వమును పురాణము చెప్పున ట్లపురాణములు చెప్ప లేవు. పద్మపురాణ మిట్లు చెప్పినది. దాని నీ మహిమ చెప్పును అది హృదయయథార్థ్యము. అది భాగవత తీర్థావతారము.

శ్రీ) మన్నికంటి రచనలో ననుగత మయిన తత్త్వ మిట్లున్నది. వైధభక్తి జ్ఞాన వైరాగ్య సహితము. దక్షిణ దేశమున నావిర్భవించినది. కర్ణాటాంధ్రములలో వైదికాచార క్రియాసంపత్తి కలిగి శోభించినది. సాత్త్విక భావముల గూడి మహారాష్ట్రమున సన్నగిల్లినది. ఔత్తరాహుల అవైధ విధానమున విజాతీయ భావసన్నివేశమున చెదరి పోయినది. విధిక్రియా కలాపము దూర ముంచిన, సాధనానుభూతులె ముఖ్యములుగ భావించిన బృందావన వీథులలో భక్తిరూపాంతరిత మయినది. పరాకాష్ఠ పొందినట్లు కన్పడినది. కాని జ్ఞాన వైరాగ్యములు ప్రక్షీణ కల్పము లయినవి. ఆ స్థితి భక్తివిధానమున కుచితము కాదు. అందుచే ననర్థము కల్గును. అపు డొక శిష్ట పరిణామము వచ్చి తీరవలయును. అది సనకాదులు సూచించిన విధానము.

ఆధ్యాత్మిక జగమును సనకాదులు పాలింతురు. నేటికిని వా రట్లు విశ్వమును పాలించు చున్నారు. తత్పాలన ఫలముగ సంప్రదాయ మవిచ్ఛిన్నమై ప్రకాశించుటను సాధకులు గుర్తింప గలరు.

భాగవతము భక్తి కలుగ జేయును. వైరాగ్య ముత్పాదించును.

జ్ఞాన మదయి ప జేయును. భాగవతము వేదసారము "వేద మీయ లేని ఫలంబును భాగవత మొసంగ వంతి సుమ్ము" అనుట భాగవత ప్రశంసా పరమై. భాగవత శ్రవణ కారణము ల తిథినియత ధ్యాన విధానము సప్తాహ విధాన దీక్ష యత్యంత మాహాత్మ్యకము" ఈ యంశమె భాగవత మహిమలో ప్రాణము. ఈ ప్రాణము తెలిసినచో భాగవత ప్రాణులకు ప్రాణశక్తి కలుగును. నేడు ఉత్తర దేశానుకరణ భక్తిలో నాంధ్రదేశమున జ్ఞాన వైరాగ్యములు సన్నగిలుట చూచిన వారీ యంశమును ప్రచారము చేయవలసి యున్నది.

ఈ ప్రబంధార్థమయిన కథాంశమున రెండు గమనము లున్నవి. భక్తి దేవి తన పుత్రులు ముసలి వారయినందున ఖిన్నురాలై నారదుని సహాయ మడిగినది. సనకాదుల నుండి నారదు డుపాయము నెరిగి భాగవతయాగ మారంభింప జేసెను. భక్తి పుత్రులు సంతుష్టులయిరి." ఇది యొకటి.

ఆత్మదేవుడు ముని సంప్రార్థన నొనర్చి పుత్రప్రద మయిన పండు సంపాదించి భార్య ధుంధులిని భక్షింపు మనెను. ఆమె ధూర్త. ఆట్లు చేయ లేదు. చేసి తి ననెను. ఉత్తుత్త గర్భవతి యయ్యెను. భర్తను వంచించినది పండు గోవునకు వేసినది గోవునకు గోకర్ణుడు పుట్టెను. ధుంధులి తన చెల్లెలి పుత్రుని తన పుత్రు చేసికొనినది. వాడు దుష్టు డయ్యెను. ఆత్మదేవునకు రోత పుట్టినది. భాగవత మనుసంధించి ధన్యు డయ్యెను. ధుంధులీ పుత్ర కల్పుని వేశ్యలు పట్టి చంపిరి. వాడు ప్రేత మయ్యెను. గోకర్ణుడు శ్రాద్ధములు పెట్టెను. ధుంధులీపుత్రుడు ధుంధుకారుని ప్రేతత్వము పోలేదు. భాగవతపారాయణము చేయగా ప్రేతత్వము పోయి దివ్యత్వము కల్గినది. ఇది రెండవ గమనము.

ఈ రెండిటి కొక అతుకు నూహింప వచ్చును. అది తుదకు విశదము నయినది. మొదటి గమనమున తత్త్వమె యున్నది. కథకు సమన్వయము లేదు. రెండవది మానవకథ. తత్త్వసమన్వయము కల కథ. అట్టికథ యాసక్తి ప్రదము. అదియె ప్రశంస నభిలషించు వారలకు గావలయును. కావలసినది మహిమలో నున్నది.

రెండవగమనములో కూడ నొక తత్త్వ గ్రంథి యున్నది. అది యప్రకాశ్యము కాదు. ఆత్మదేవుడు జీవుడు. జీవునకు భౌతిక దేహము కన్న విద్యా

మయు తపోమయు యజ్ఞమయు దేహమె ముఖ్యము. అది భాగవతామృత మున లభించును. ధుంధులీ పుత్రుడు ధుంధుకారి జీవుని దుష్టచిత్తము. అది అస్వప్రాప్తము. దుష్టచిత్తము పంచేంద్రియ వశమై హత మగును. గోకర్ణుడు జీవుని నిశ్చయాత్మక మయిన బుద్ధి. అదియె జ్ఞానవైరాగ్యముల గూడిభాగవ తభక్తి కలిగి యనుసంధాన మొనర్చును. ఆ విధి సర్వప్రదము.

ముఖ్య మగునది మరి యొకటి కలదు. అది లేకున్న నేదియు లేదు. మహిమలో నదియె ముఖ్యము. అసలు భాగవతము నారద ప్రేరణ ముననె యవతరించినది. తద్విషయమై నారదు డందుకొన వలసినది యిం దున్నది. అదియె సప్తాహదీక్ష. సనకాదులు దానినె యుపదేశించిరి. నారదుడు చేయించిన దది. గోకర్ణు డొనరించినదియు నదియు.

సప్తాహ దీక్షా యాగశాలలో ధుంధుకారునకు స్థలము లేక పోయిన దట. వెదురులో వాయువై దూరెనట. ఆ వెదురులో నేడు గ్రంధులు దిన మున కొకటిగా భిన్నము లయినవి. గ్రంథిభేదనము కాగా వాడు ధన్యు డయ్యెను. మానవుని వెన్నెముక వెదురు. అందును ఏడు స్థానము లున్నవి. మూలాధారాది షట్చక్రములు దాటి సప్తమావరణము దాటిన బ్రహ్మమృ తము లభించును. ఈ యోగప్రణాళిక యిం దున్నది. అది సప్తాహదీక్షా రహస్యము. ఇది సనకాది విద్య. అందుననే భాగవత సప్తాహము ప్రమితము.

యోగవిద్యాసక్తు డయిన మిన్నికంటి గురునాథశర్మ సమాసక్తితో భాగవతమాహాత్మ్యమును అనువదించెను. కొన్ని యంశముల నచటచట స్వసంతృప్తికై విస్తరించెను.

ఇమౌ తు శయితౌ వత్ర సుతౌ మే క్లిశ్యత ః క్రమాత్
ఇదం స్థానం పరిత్యజ్య విదేశం గమ్యతే మయా.

దీనికి స్వేచ్ఛానువాద మొనర్చెను 1-76.

ఇట్టివి కొన్ని యున్నవి. మిన్నికంటికవి కోమలహృదయుడు. ఆత్మ దేవ కథా కథనమున నిది స్పష్ట మగును. ధుంధులి భావములను ఇంక నట్టి విశేషములను లోకము చూచి చెప్పినట్లు చెక్కినట్లు గోచరించును. ౧౦౦పుటలో రాజమహేంద్రవరము విజయవాడ నెల్లూరు లున్నవి. కవి కవిపరిచితములు. ఆనాట కాకపో వచ్చును. అయిన నేమి? ఈ నాటి

నాటక కల్పన కవికి వచ్చినది. కవినాటకకు కవితలో నేల రావ్రు? తెలుగు నాటి తిక్కనాదుల కృతుల మహిమలో నెన్నియో యున్నవి. నిత్యజాపక మయిన గురునాథశర్మ కవితా భావుకతా సంపత్తి ఫలమయిన యీ భాగవత మహిమ భాగవత జనతకు వశ్యము సేయును. వివక్షితమును విడువక అనపేక్షిత మగు యంశము కొంచెము రచన చేయుట కవి కభీష్టము. కవి యయిన శ్రీ మిన్నికంటి గురునాథశర్మ తన కవితకీ విధానము ధన్యత నాపాదించు నని సంభావించెను. ఇట్టి చిత్రనాటక మందరకు నుండెను. గురునాథశర్మ గారికి వయఃపరిణతి చాల నున్నది. కవితకీ నాటకకు కలిగిన యీ పరిణతి యీ పరిణతి, పరస్పరవిభూతి సుందరమునై యుండుట నాశించుచు.

ఇక నిది నిగమనము. నవకాలాధ్యాత్మిక సమన్వయ సంధాతలు. సాధన వ్యత్యయము లోకమున గలిగి నప్పుడు వారి సంప్రదాయము ప్రతిష్ఠింతురు. తదనుసరణము మనకు శరణ్యము. భాగవత మాహాత్మ్య ప్రతిపాదకము అయిన యిందలి కథలలో స్వార్థతాత్పర్యము లేదు. భక్తి జ్ఞాన వైరాగ్యములకు వ్యక్తి రూప మాపాదించిన కల్పనము స్పష్టము. ఆత్మదేవుడు దుంధుకారుడు గోకర్ణుడు అను వ్యక్తుల విషయమై జీవగతి సంబంధమును స్పష్టము. ఈ కథ లందలి సమన్వయము చూచుకొని గ్రంధిభేదనము సంపాదించుకొనుట భాగవతయోగము. ఈ యోగమే ముఖ్యముగా అసలు భాగవతమును గూడ భావించుట సాధకపథము. సాధకపథ సంచారులు గురునాథశర్మగారు భాగవత మహిమ ద్వారముగా కావ్యయోగమును సూచించిరి. భాగవతవిభూతి కావ్యవిభూతియై యవతరించుట సాధకుల కానందానుభూతి.

"భుక్తి ముక్తి ప్రదాం భక్తిం
జ్ఞాన వైరాగ్య సంహితాం
కావ్యయోగ సమాలీఢాం
లోకా భజత! భావితాః"

భాగవత గోష్ఠి
మార్గ కృష్ణ నవమి

జమ్ములమడక మాధవరామశర్మ.
గుంటూరు.

శుభమస్తు.

అవిఘ్నమస్తు.

# శ్రీమద్భాగవత మహిమ.

## ప్రథమాధ్యాయము.

శ్రీమహితు సచ్చిదానం
దామల రూపుని బ్రకృతి ని♦యామకు సృష్టి
క్షేమ లయ కారణుని స
ర్వామర పూజితుని దలఁతు ♦ హరి హర నాథున్.

జనని యొడిఁ జేర్చి చీ ఫో!
యని నవ్వింపంగ బోసి♦యగు నోట జగం
బును జూపి సంభ్రమము గూ
ర్చిన శ్రీకృష్ణపరమాత్మ ♦ హృదిని స్మరింతున్. 2

సకల విభూతు లందఱ కొ♦సంగును దాను గజాజినంబు గ
ట్టికొనును, బాఁప పేరుల ఘ♦టించును జాబిలివంక పూవుఁ బె
న్నిక ధరియించు బూది మెయి♦నిండ నలందు వృషంబుపైఁ బ్రపం
చకమునఁ దారు నట్టి ఘన♦శాంకర తత్త్వము నాశ్రయించెదన్.

తలి నిన్నాకిట నిల్పి పోవునెడ నే♦తద్వామ హస్తంబునం
గలమా? కార్ముకమా? వెలింగెఁ బ్రమథుల్ ♦ కారాకులై రక్షరా
వళులా? యయ్యవిబాణపుందుటుములా?♦బాబయ్యా! నీ వన్నిటం
గలవే! కాన గణాధిపుండ వయితో?♦కైకొమ్ము నామ్రొక్కులన్.

పింగ జటా రంగున్ గృ
ష్ణాంగున్ గృష్ణాజినోత్త ♦ రా సంగున్ స
త్సంగు నట ప్రచ్ఛురితరసనో
త్సంగు దయాపాంగు వ్యాస ♦ సంయమిఁ దలఁతున్. 5

అమలినభక్తిఁ గొల్తు నిగ♦మాంతములన్ గ్రహియించి యెల్ల క
ర్మములఁ ద్యజించి ప్రవ్రజిత♦మార్గము వట్టి యొకండపోవ మో
హమున నురార! ముద్దుకొడుఁ♦కా! యని వ్యాసుఁడు పిల్వ దన్మయ
త్వమునఁ బ్రతిధ్వనించెఁ దరు♦వర్గము తత్సకలాత్ము శ్రీశుకున్. 6

మనసిచ్చెనా! యెట్టి ♦ మందమతికి నైన
నఱచేతిలో మోక్ష ♦ మగపడుచును
గర్జించెనా? యెట్టి ♦ గడుసరి బుధుఁడైన
దాసోహమని వల్కి ♦ తప్పుకొనును
బోధించెనా? యెట్టి ♦ భూరి శాస్త్రంబైన
ననఁటిపండొల్చి పె♦ట్టిన విధంబె
ఆసీనుఁ డయ్యెనా? ♦ యానందమున నిర్వి
కల్ప సమాధిలోఁ ♦ గ్రాలుచుండు
సంతత జ్ఞాన వైరాగ్య ♦ సంయుతుం డ
నఘుఁడు కల్యాణ పూర్వ కా♦నంద భార
తీ యతీంద్రుఁ డస్మద్గురు♦దేవుఁ డేను
వారి పాదపద్మంబులన్ ♦ భక్తిఁదలఁతు. 7

కాశికా లింగమ్ముఁ ♦ గైఁబూని కాల్నడఁ
దోడ్తెచ్చె శివరామ ♦ ధూర్వహుండు
తన తండ్రి సప్త సం♦తానంబులను జెడి
పోనీక పోషించె ♦ బుచ్చిరాజు
'పరుచూ' ర్గ్రామాధి♦కారి యుదారుండు
ధీరుంతు నా మీాతె ♦ పేరరాజు
వ్రాయంగఁ జదువంగ ♦ వాదముల్ దీర్పంగఁ
బ్రౌఢుఁ డయ్యెను శివ♦రామ బుధుఁడు
ఏరి ప్రపితామహుఁడు, తాత, ♦ సూరిమి పిత
యన్న యెనలేని కీరితిఁ ♦ గన్నవారొ?
అట్టి లక్ష్మార్యునకు మదీ♦య జనకునకు
నా జనని సుబ్బమకు వంద♦నము లొనర్తు. 8

వికృతి సంవత్సర మార్గశిర కృష్ణ దశమీ సౌమ్యవాసరంబున (3-1-1951) నా నిత్య కృత్యంబగు సహస్ర గాయత్రిం గావించుకొని శ్రీమద్భాగవత మహిమ వ్రాయ నిట్లిష్టదేవతా గురు నమస్కారము లొనర్చుచున్నాఁడ. దీనికిఁ దొలినాఁ డొక విచిత్రము జరిగినది. దాని నెల్లవారు నమ్మకున్నను సత్యము చెప్పెదను. పరులు నవ్విన నాకేమి? వికృతి మార్గశిర కృష్ణ నవమీతిథి వేకువఁ గలలో నొక్క విశాల నేత్రుని దివ్య తేజో ముఖమండల సందర్శన మహాభాగ్య మువరిద్వారమున లభించినది. అమ్ముఖారవిందము హరిదియో హరునిదియో గుర్తింపనైతిని. అమ్మధురస్మిత రోచులు దవ్వుల నున్న నాపైఁ బ్రసరించుచుండెను. వేనకువేల జను లడ్డముంటచే దాపున కేగలే

నైతిపి. అవ్వేల నవ్వుచు సమ్ముఖంబున బోనికరిగె. నాకు మెలఁకువ కలిగె. ఆనాటి సాయం సమయమున దనయింటి ముంగలగా నల్లంత చన్న సన్నుఁ బెద్ద మెలుంగునఁ జీరి మన్మిత్రుండు పరమ బ్రహ్మణ్యుండు యోగ వాసిష్ఠాంధ్రీకర్త శ్రీమద్దూరి సాంబయ్యగారు 9

అంధులకు సులభముగఁ దెలి
యఁ జేయ తెనుఁగుబాస ♦ ననువాద మొన
ర్పంపగఁ జూమ్యా యంటి యు
క్త్యం దద్భాగవత మహిమ ♦ చెలువారు కృతిన్. 10

వీను దమ కిష్టుఁడే వా
గ్దానము చేయుఁగ లేను ♦ దానిఁ జదివి యా
పై నెఱిఁగింతును భగవ ద
ధీనుఁడ నే నెవఁడ నెయ్య♦ది యొనర్చుటకున్. 11

అని పలికి వచ్చి యాలో
చన మొనరించితిని నంత ♦ స్వప్నంబునఁ దోఁ
చిన కోటిసూర్య తేజో
ఘనము స్మృతికి వచ్చి ధైర్య ♦ కలితుఁడ నైతిన్. 12

అ రేయియే యా సంస్కృత కృతిం జదివి యనువదింప సంకల్పించి నిదురించి మఱునాఁ డీస్తోత్రాదికము వ్రాయుచున్నాఁడను. 13

ఉత్తమ మగు పద్మ పురా
ణోత్తర ఖండమున వ్యాస ♦ సూక్తి మహిమ సం

పత్తి కలదు తెలుఁగున నది
హత్తింపఁగ మొదలయిడితె? ♦ హరి హర నాథా. 14
భాగవత మహిమ నుడువఁగ
వాగీశుండో? శుకుండో? ♦ వ్యాసుండో? ది
వ్యాగమమొ? కాక పెర యెవఁ
డాఁగఁగలఁడు బొమ్మ సఱచి ♦ హరి హర నాథా. 15
ఉన్నది యున్న ట్లెఱిఁగిం
తున్నేఁ గ్రొత్త తలఁపులను ♦ దొర్లింపఁ దదీ
యౌన్నత్యంబున శంకా
స్కన్న మతులు గాకుఁడయ్య ♦ సజ్జనులారా! 16
కతలో, వర్ణనలో, నా
స్వతంత్రతను జూపెదను రసం బుట్టిపడన్
మతిమంతులు దలలూఁపని
కృతి యేటికి? బీరువాలఁ ♦ గ్రిములు దినుటకే? 17
* భాగవతము వ్రాసి పిదప
మూఁగగ నున్నానను మరలఁ ♦ బురికొల్పితివే
భాగవత మహిమ వ్రాయ ద
యా గరిమ, నిదెంత పేర్మి! ♦ హరి హర నాథా 18
నీ లీల లద్భుతంబులు
బాలుని మాటలను వినఁగఁ ♦ బాల్పడితివి నా
కేల మది సంశయ మ్మికఁ
నాలింపఁగదయ్య వినుతు ♦ హరి హర నాథా. 19

* ఇప్పటికి నేకాదశ ద్వాదశ స్కంధముల నాంధ్రీకరించితి.

# కథాప్రారంభము.

కల మునులు సత్రయాగము
సలుపుచునున్నయెడ నైమి♦షమ్మున శ్రీ వ్యా
సుల శిష్యుండు మహామతి
కలఁడు బహు పురాణవిదుఁ డొ♦కఁడు సూతుఁడనన్. 20

ఆ సూతున కభివాదము
సేసి కథామృత రసం బ♦శేషము ద్రావం
దోసిలి వట్టుటలో న
గ్రేసరుఁడగు శౌనకర్షి ♦ కేల్మోడ్చి యనెన్. 21

సూతా! శమాది షట్క స
మేతా! యజ్ఞాన బహు తి♦మిర విధ్వంస
ఖ్యాత ధిషణార్కకిరణ
వ్రాతా! తాతా! యొకండు ♦ ప్రార్థన వినుమా! 22

చెవులకుఁ బండువ యవుగతి
వివిధ కథాసారములను ♦ వినిపింపుము భా
గవతుల కెటు భక్తి జ్ఞా
న విరాగ వివేక వర్ధ♦నంబగు నొక్కో. 23

వైష్ణవులు మహా♦మోహా మే♦పగిదిఁ ద్రోసి
వైతు? రీ పాడు కలి నెల్ల ♦ వారు నసుర
భావులై క్లేశముల మ్రగ్గు♦వారె, వార
లెట్లు బాగుపడుదు రాన♦తిమ్ము దేవ! 24

పావనములలోనఁ ♦ బావన మైనది
శ్రేయములను మివుల ♦ శ్రేయమైన
దనఘ! కృష్ణుఁ జేర్చునట్టిది యొక శ్రేష్ఠ
మైన సాధనమ్ము ♦ నానతిమ్ము. 25

లోకసుఖము చింతామణి, ♦ నాక సంప
దలను గల్పవృక్షమ్ము లో♦కుల కొసంగు
తుష్టుఁడొ గురుండో యోగి ♦ దుర్లభంబు
పావనంబు వైకుంఠంబు ♦ పడయఁ జేయు. 26

అనిన సూతుం డిట్లనియె. 27

శౌనకమునీంద్ర! నీప్రియం♦బైన ప్రశ్న
మునకు లెస్సగా యోజించి ♦ వినుతునయ్య.
సర్వ సిద్ధాంత సార మ్మ♦సార పార
దూర ఘోర సంసార ని♦స్తారకమ్ము. 28

ఏది భక్తి వృద్ధి ♦ నొసఁగించు? నేది శ్రీ
కృష్ణ దేవునకును ♦ బ్రియకరమ్ము?
దాని నీకుఁ జెప్పె ♦ దను వినుమా! సావ
ధాన చిత్తమునను ♦ శౌనకర్షి! 29

శ్రీ మద్భాగవతమ్మున్
స్వామి శుకమహర్షి కలినిఁ ♦ జాటినదానిన్
భీమాస్య కాలసర్పో
ద్దామ త్రాసాతిశయముఁ ♦ దఱిమెడి దానిన్. 30

వినుము దానికన్న మఱొకటి
పౌనుపున దించుకయు మదిని ♦ భూతము సేయన్
జనసాంతర పుణ్యం బుం
డిన నే భాగవత మాత♦నికి లభియించున్. 31

(శ్రీ) శుకమౌని పరీక్షి న్నరేంద్రున
కతిముదంబున భాగ♦వతము సెప్ప
సభలోన నుండిన ♦ సమయంబు నందు సు
ధాకుంభ హస్తులై ♦ నాకవాసు
లరుదెంచి శుకమౌని ♦ కభివాదనము సేసి
పలికి రిట్లు స్వకార్య ♦ పరతఁ జేసి
మునివర్య ! యిదె సుధా♦పూర్ణ కుంభము తెచ్చి
తిమి కథాసుధనిచ్చి ♦ దీనిఁ గొనుఁడు

ఏము శ్రీభాగవత కథా♦మృతము గ్రోలి
తనిసెదము మీరు కృపున క♦ద్దాని నొసఁగ
నాత డయ్యమృతము ద్రావి ♦ యమరణుఁ డగు
వినిమయంబున కిది ఫలం♦బనఁగ నపుడు. 32

ఫక్కున నగి యిట్లనె నా
టక్కరి వేల్పుగమితో జ♦టాధారి భళీ !
యెక్కడి కథ! యెక్కడి సుధ!
యెక్కట! మణికాచ మొక్కఁ♦డగునా? యొందున్. 33

అని వా రభక్తులై యుం
ట నెఱింగి కథామృతం బి♦డక పంపించెన్

ఘన భాగవతీ కథ ల
య్యనిమిషులకుఁ గూడ దొరక♦వయ్య మునీంద్రా! 34

జనపతి మోక్షముం గనుట ♦ సారసగర్భుఁడు సూచి విస్మయం
బునఁ దన సత్యలోకమునఁ♦బూనిచి త్రాసునొకంత దూఁచె సా
ధనముల నెల్ల, నేవియును ♦ దాని గురుత్వము నందలేక పో
యె నపుడు సూచుచున్న ఋషు♦లెల్లరు నచ్చెరువంది రాత్మలన్

జనులు కనుఁగొనిరి భగవం
తుని భాగవతమ్ము భక్తి♦తోడఁ జదివియు
న్వినియును వైకుంఠమునకుఁ
జనియును గలి దీని కేది♦సాటి మునీంద్రా 36

మును నారద ముని పతికి
స్సనకాది మునీశ్వరులు ఘృ♦ణాపరు లగుచున్
వినిచిరి సప్తాహంబునఁ
బ్రణతశ్రేయః ప్రదంబు ♦ భాగవతంబున్. 37

బ్రహ్మ సంబంధ సంవర్తిం జేసి నారదుండు భాగవతంబు నెఱింగి యున్నను సప్తాహ శ్రవణ విధిమాత్రము సనకాదులు నారదున కెఱిఁగించి రనిన శౌనకమహాముని యిట్లనియె, 38

* సనకాదికుమార నారద సమావేశము. *

జుట్లు జుట్లకు ముడివెట్టి ♦ చోద్యముగను
జూచుచుండు, నొక్కెడఁ గాలు ♦ సానిపి నిలువఁ
డట్టి నారదుండు విధిగ ♦ నెట్టు వినెను?
సనక మునులతో యోగ మే ♦ చాయఁ గలిగె? 39

అనిన సూతుఁ డిట్టు♦లనియెఁ జెప్పెద విను
భక్తియుక్తమైన ♦ భవ్య కథను
దాని నాకు శుకమ♦హానుభావుఁడు రహ
స్యముగఁ జెప్పె నీకు ♦ నది వచింతు. 40

కలదు విశాలాపుర ము
జ్జ్వల నగరీవరము బహు వి♦శాల నిషద్యా
వళి సుందరము నభస్స్పృ
ఙ్నిలయ మనోహరము బహుళ ♦ నృచయాకరమున్ 41

అచ్చట వెలసిన ♦ యక్షిలేశ్వరుం డొసం
గని వాంఛితంబులు ♦ గానరావు
అచ్చటి తీర్థమం ♦ దవగాహన మొనర్పఁ
గాఁ బోవకున్న రో♦గములు లేవు
అచ్చటి క్షేత్రమం ♦ దంఘ్రి మోపిన వచ్చి
వాలని పుణ్యపుం♦జాలు లేవు
అచ్చటి గాలి మై♦సంటినఁ గలుగని
ప్రవిమలజ్ఞాన సం♦పదలు లేవు
భుక్తిముక్తుల కయ్యది ♦ పూల బుట్ట
సాధుకోటుల కయ్యది ♦ సాము గరిడి
సర్వవిద్యల కయ్యది ♦ సంతవాడ
కాపురము లక్ష్మి కది విశా♦లా పురమ్ము 42

అం దొకనాఁడు నలువురు మ
హీంద్రులు సద్గోష్ఠికై వి♦హృతి సల్పుచునుం

డం దపసి రతనము శతా
నంద సుతుఁడు నారదుఁడు క♦నం బడె నొకచో 43
నారదుఁడు వందనము సేయ ♦ నలువురు ప్రతి
వందన మొనర్చి నారదు ♦ వాలకము నె
గాదిగం జూచి సనకాదు ♦ లాదరమునఁ
బలికి రిట్లు గంభీర ని♦స్వనము దోఁప 44
ఏమి మునీశ్వరా! కుశల♦మేకద? యెక్కడనుండి రాక! నీ
మోమది యేల విన్నఁదన♦ముం గనె? నెక్కడ కేగుచుంటివో?
తామసముం బొనర్పక గ♦త ద్రవిణుంబలెఁ జింతిలం గతం
బేమి? విముక్త సంగులకు ♦ నీ తెఱఁ గొప్పదుగాదె నారదా!

నారదుఁడు సనకాదులకుఁ దాను గన్న తీర్థములం జెప్పుట.

నావుఁడు నారదుండు ఋషి♦నాథుల కిట్లనె నుత్తమోత్తమం
బీ వసుధాతలం బని గ్ర♦హించి యిటం జరియించుచుంటి గో
దావరిఁ బుష్కరంబునను ♦ దానము సేసి ప్రయాగ మాధవున్
సేవలఁ దన్పి కాశిని వ♦సించితిఁ గొల్చుచు విశ్వనాథునిన్. 46
ధాత్రికి భూషణం బయిన ♦ ద్వారకకుం జని మేఘ విద్విష
ద్గాత్రు రమా కళత్రు హరిఁ♦గాంచి సపర్య లొనర్చితిన్ గురు
క్షేత్రము మెట్టితిం బిదప ♦ సేతువు డాసితి రామలింగని
న్నేత్రము నిండఁ జూచితి ము♦ని ప్రవరుల్ జని ధన్యమయ్యెఁ బో
పొంగారెడి మనము వెలుం
గం గంటిన్ రంగనాయ♦క శుభాంగము శ్రీ
రంగము కైవల్య రమా
త్సంగము వైష్ణవ మహాప్ర♦జా సంగమ్ముల్. 48

మఱియుం గల తీర్థములం
దరిసించుచుఁ దిరుగుచు వసుధాతలము మునీ
శ్వరులారా! యరసితి నెం
దరసిన శర్మమ్ము దోఁప దాత్మ సుఖంబున్. 49

* నారదుఁడు సనకాదులకుఁ గలి విశేషములు చెప్పుట *

చాకరే! యధర్మ సఖుఁడైన కలిచేతఁ
బుధమిత్రుల బాధపడుచు నుండె
సత్యమును దపంబు శౌచంబు దయయును
దాన మెచటఁ గానఁ దానఁ బడదు. 50

అక్కట! యేఁడుగన్న జనులంతయుఁ బొట్టల నింపువారె బల్
బద్దలు పల్కువారె పరలంజెఁ గొట్టఁ దలంచువారె పెర్
రద్దికి వొగ్గువారె శ్రుతిరాజముఁ దిట్టెడు వారె పున్నెపుం
బుద్దులు లేనివారె కడ మొద్దులె మోఱకులే గరాసులే. 51

అగ్ని యెదుట 'నాతిచరామి' యని ప్రమాణ
మాచరించి పెండ్లాడిన యట్టి వారె
కొండొరుల నెడఁబాసెద రొండె, మోస
గించి చరియింతురొండె సేమంచు నోడువ. 52

అరరే! కడుపునఁ బుట్టిన
గరితల నమ్ముకొని ధనముఁ గైకొనఁగా సాఁ
గిరి యీ కలియుగ మందును
నరులా? రాక్షసుల? వీరు న్యాయము సెప్పుఁడా! 53

ఆలె గృహంపుఁ బెద్ద కల దన్నను లేదసినన్, స్వమాతయుం
జాలదు తండ్రి మాట కొనసాఁగదు సర్వము నిర్ణయించి యీ

పోలికి సంచరింపు మని ♦ బుద్ధులు సెప్పుచు నుండువాఁడు త
త్త్వాలకుఁడే గృహస్థుఁ డిపు♦డాయెను జూపుల గొడ్డుగీమునన్
నదులును దీర్ఘము లాశ్రమ
పదములు యవనావృతములు ♦ పాషండాద్యు
న్మదితులు దేవాలయములఁ
గదిసి చెఱిచి రకట! పెక్కు♦గతుల నిజేచ్ఛన్, 55

లేఁడు సత్క్రియుండు♦లేఁడు సిద్ధ వరుండు
లేఁడు జ్ఞాని యొకఁడు♦లేఁడు యోగి
కలి యనియెడు పెద్ద ♦ కార్చిచ్చు చేతను
సాధనంబు భస్మ ♦ సాత్కృతంబు. 56

జనపదము లన్న విక్రయ♦శాల లయ్యె
బ్రాహ్మణులు వేద విక్రయ♦ప్రవణు లైరి
అంగనలు స్వకీయాంగమ్ము ♦ నమ్ము కొనెద
రిట్టి కలిదోషములఁ గను♦చిలఁ దిరుగుచు 57

* నారదుఁడు యువతీ వృద్ధులం జూచుట *

ఎవఁడు సేసెనో? కుండ ♦ లీంద్రు ఫణామండ
లిం డాకఁ దాండవ ♦ హిండనంబు
ఎవఁడు నీరాడు గో♦ప వధూ దుకూలముల్
గైకొని లేమ్రాఁకు♦పైకిఁ బ్రాఁకె
ఎవ్వఁ డవ్వరుణు ప్రో♦లేగిన నంద గో
పుం దెచ్చె డెంద మా♦నంద మొంద
ఎవఁడు సూపెను నిజా♦కృతి సుందరతను గా
ళిందిలోఁ గాందినీ♦నందనునకు

బ్రహ్మ గాంధర్వ నీత మో♦హ్వాఁడు వాసె
వాసిఁ గైసేసి వేసాలు♦ గాసిపఱిచె
నట్టి శ్రీకృష్ణ లీలల ♦ కావటమ్ము
యామున తటమ్ము ముక్తిక♦న్యా నటమ్ము. 58

ఆరయఁ జేరఁ బోతి నట ♦ నావల నావుల కోకదానిఁ గో
కారిని జేరికిం గొనని ♦ యాస్యము దానిఁ బ్రశస్య దాని క్రొ
వ్వాఁడి వుచ్చు ముద్దు నడ♦యంగులదాని ననంగు భృంగుల
న్గేరెడు కొప్పుదానిఁ దరు♦ణీ న్ననఁబోణి నొకర్తుఁ గాంచితిన్.

వేసవి తఱి యొళ్ళ♦త్రో సరిగా సిరల్
బయటఁ బడియె నెత్తు♦వట్టి పోవ
బొజియల నిఱుకు తా♦మర లట్లు బొమ్మ గుం
టలలోనఁ గన్నుల ♦ కుంగ యుండె
తేప లేని వయిరు♦తీరునఁ బలుచనై
వెంద్రుక లన్నియు ♦ వెలరు వాఱె
పడమటఁ బొడము నా♦గడపల పడువున
నొడలిపై నెల్లెడ ♦ ముడుత లడరె
పట్టు తప్పి యుంగంబులు ♦ వడఁకఁ జొడఁగె
నిడుద యూర్పు గాడ్పులు మాత్ర ♦ మడరు చుండె
నిట్టి యువురు వృద్ధు ల♦య్యేడ ధరిత్రిఁ
గదలి మెదలక పడియుండఁ ♦ గంటఁ బడిరి. 60

## * యువతి వృద్ధులం గూర్చి విలపించుట *

యువతి వృద్ధుల ప్రక్కఁ గూ♦ర్చుండి ఖిన్న
వదనయై బొట బొట నశ్రు ♦ వారి బిందు

లురలి చెక్కిళ్ళపైఁ బడు♦చుండ రోద
నంబు సేయుచు నిట్లు ల♦నం దొడంగె. 61

బిడ్డలార ! యెంత♦చెడ్డ కాలము వచ్చె
నాదరించు వారు ♦ నాదరువును
జూపువారు లేక ♦ స్రుక్కవలసి వచ్చె
నూఱడిలుఁడు ధైర్య♦మూని నిలుఁడు. 62

ఉన్నది లేనిది యెఱుఁగరు
చన్నది తిన్నదియు నెఱుఁగఁ♦జాలరు పరు లే
మన్నది చేసిన దెఱుఁగరు
గ్రన్నన నీపాటు లేల♦గలిగెను మీకుఁ ? 63

దూషించిన భూషించిన
రోషింపరు తోష మొంద♦రు శరీరమ్ముఁ
శోషింపఁజేయ రెలమిం
బోషింపరు మీకుఁ గూడ ♦ ముప్పు గలిగెనే ? 64

తెలిసికొనరు వలువ మెయిం
గలదో? లేదో? పడినది ♦ గ్రామమొ? వనమో?
నిలిచితిరో? కూర్చుంటిరో?
పిలిచినఁ బలుక రదియేమి? ♦ ప్రియసుతులారా ! 65

అయ్యో ! వీరిని గాపాడుఁ ♦ డన్నలార !
ఆఁకలియొ దప్పియో చూడుఁ ♦ డయ్యలార !
చెవులు మూయరే నాడి వీ♦క్షింపరే మ
హానుభావు లీదెస నెవ్వ♦రైన లేర ? 66

అని పలవించుచుం డెసల ♦ నారయుచుఁ గ్రుమ్మసళ్ళ కంతలో
గన యుచితోపచారము లొ♦నర్చుచుఁ దత్తఱ మొందుచున్న న
ప్పొవితను జుట్టుముట్టి మగ♦వల్ మఱికొందఱు బుజ్జగించు చో
య్యావ సుటీక్షో విసరు♦చమ్మరో! వందురఁబోకు మంచనన్
సను దవ్వులనుండి య♦దెల్లఁ గాంచి
యేమి యీదుఃఖ? మిదేమురాక ♦ యేమి? తెలిసి
కొనియెదం గాక యని చెం♦తకుం జనంగ
నన్నుఁ గని లేచి యువతి వం♦దన మొనర్చి. 68
రండు దయచేయుఁడు తమ ద♦ర్శనము కతన
నా యెడందలోని వసట ♦ నాశ మయ్యె
సాధు దర్శనంబునఁ గలు♦షములు దొలఁగు
నెంత భాగ్యమో మిముఁ గంటి ♦ నిట్టియెడల. 69
తమవంటి సాధువు,లను
త్తమ దర్శన మొసఁగి లోక ♦ తతి పాపములన్
దమియింతు, రింక నొకవా
క్యముఁ బలికిన ఫలముఁ జెప్ప♦నలవియె నాకున్. 70

* నారదునకు యువతి తమ వృత్తాంతము చెప్పుట *

నావుఁడు నే నిట్లడిగితి
నీ వెవరమ్మ? పడియున్న ♦ వృద్ధులెవరు? లీ
లావతులు వీరలెవ్వరు?
నీ వేడ్చెద వేలనమ్మ ♦ నిఖిలము చెప్పుమా! 71
అనఁగ యువతి పలికె ♦ నయ్యా! నే భక్తిని
గాలవశత వార్ధ♦కమును గన్న

సూను లీ యిరువురు ♦ జ్ఞాన వైరాగ్య వి
ఖ్యాత నామములను ♦ గన్నవారు. 72

గంగాదులు నా శ్రమ మడఁ
గంగాఁ గొలుచుటకు స్త్రీల ♦ గతి వచ్చిరి వే
గం, గాని సురల కొలు వెసఁ
గంగాఁ గూడ సుఖ మొడఁదఁ ♦ గలుగదు నాకుఁ. 73

ఆలసింప నేగు టొకింత ♦ యాలకింపు
మామకీన వృత్తము చంద♦మామ ఘుటిక
చాలఁ గలదయ్యె యైన వా♦చాలఁ గాను
దాన సంక్షేపముగఁ జెప్పు♦దాన వినుము. 74

ద్రవిడ దేశమ్మున ♦ నవతార మొత్తితిఁ
బెరిగితిఁ గర్ణాట ♦ పృథివి మీఁద
నంత మహారాష్ట్ర ♦ మం దించుకించుక
సన్నగిల్లితిని ఘూ♦ర్జరమునందుఁ
జాగుజే! దుష్ట పా♦షండులు దుండగుల్
ఖండించి రీయంగ ♦ కములఁ బట్టి
యేమి చెప్పదుఁ దండ్రి! ♦ యిట్టి రూపున నేను
గొడుకులతో నెంతొ ♦ గోడు గుడిచి

ఆవలం జాసితిని వైష్ణ ♦ వావనమ్ముఁ
బావనమ్ము శ్రీకృష్ణ బృం♦దావనమ్ము
నచట రమ్యనైతి నవీన ♦ నైతి యువతి
నైతి సుందరినైతి ది♦వ్యాంగ నైతి. 75

నా సుతులు జ్ఞాన వైరాగ్య ♦ నామకులు
మమ్ము సెంది యచ్చట విశ్ర♦మమ్ము గొనిరి
శయితుల న్వీడి నే విదే♦శముల కరిగి
తిరిగి వచ్చితి నయ్య బ్ర♦హ్మ ఋషివర్య ! 76

ముదిమి చేత మిప్పుల ♦ సద సద వడుచున్న
కొడుకుఁ గుజ్జలఁ గని ♦ కుందు చుంటిఁ
దల్లి నైన నేను ♦ తరుణి నౌట యదేల ?
యకట ! సుతులు వృద్ధు♦ల గుట యేల ? 77

ముప్పుర మొందు నోక్కుటనె♦పొల్పుచు నందువయసు వీడియుండరే
మవ్వను గాన నే ముసలి♦నౌట కుమారులు గాన వీరలున్
జవ్వనమందు నుంట యిది ♦ సాజము లోకము పాడి యట్లుగా
కిట్విధి మార్పు గల్గుటకు♦హేతు వదేమొకో? చిత్రమయ్యెడిన్.

యోగీశుల కెఱుక పడని
బాగోగు లెసఁగ, విద్ది ♦ వచియింపు ఘృణా
సాగర! నిన్నట్టికనన్
లోఁగడ నిను జూచినట్టు♦లుగ స్ఫురియించె 79

తనకుం దానయి వెంట వచ్చెడిని జం♦త్రం బాత్మ శిష్యుం బలెన్
గొనఁ బ్రేలంటక యున్నఁ దంతులవె ప♦ల్కున్ శ్రీహరీ! యంచు,మి
మ్మును గన్నప్పటినుండి నాయవయవం♦బుల్ సర్వముంబుష్టినొం
దెను, నాతండ్రివి నారదుండవటె సం♦దేహంబు గల్గెంగదే! 80

అనఁగా నవ్వుడు నవ్వుచు నే నిట్లంటిని. 81

* యువతి ప్రశ్నములకు నారదునుత్తరము *

అమ్మ! విషాద మందకు ద♦యానిధి కృష్ణుఁడు మాధవుండు సౌ
ఖ్యమ్ములు నీకొసంగఁ గలఁ♦డంచుకు నంజియ మందఁబోకు నే
నిమ్మగ దివ్య దృష్టిఁ గని ♦ యెల్ల విశేషముల న్వచింతు స
త్యమ్మగనంచునొక్కతఱి♦నూగ్రహించి యిటుల్వచించితిన్.

అమ్మా! విను మిద్ది మహో
గ్రమ్మైనది కలియుగమ్మ ♦ గాన సదాచా
రమ్ములు యోగమ్ములు సుత
పమ్ములు సర్వమ్ము మాలఁ ♦ బడినవి తల్లీ! 83

జనములు దుష్ట కర్మములు♦సల్పు చఘాసురులై రి యెందుఁ గ
న్నను గపట స్వభావులై క♦నంబడుచుండిరి తల్లి! చూడు స
జ్జనులు విషాద మందెద ర♦సాధులు పొందెద రాత్మల న్ముదం
బునుధృతిగల్గి నిల్వఁబడు♦పూరుషుఁడేబుధ వాచ్యుఁడయ్యెడిన్.

వినఁ గనఁ దాకం గూడని
యనేక పాపి తతి వృద్ధి♦యై యేఁటికి నేఁ
డనయమ్మ బరువు పెరుగఁగ
ననంతు వేతలలు విఱుగు ♦ నమ్మా! భక్తీ! 85

ఇట్టి యికాలమం దెవ్వఁ♦డేని యొకఁడు
గూడఁ గొడుకులతోడి నీ♦జూడఁ డమ్మ
కేరి కామాంధు లౌచు వే♦క్షింతురు భవ
దాత్మజుల దాన శిథిలాంగు♦లైరి వీరు. 86

బృందావనమున కరుదే
రం దారుణ్యంబు క్రమ్మ♦ఱ న్నీకు మహా

నందముగ నందగించె ము
కుంద చరణ భజన మింద్రు ♦ గుందదు దేవీ! 87

బృందావనమ్మున భవ
న్నందనులను విడిచి వైచి ♦ నరులు సదా ని
న్నుం దమ యెడందలం జెల
విం దలపోసి భజియిం త♦మేయ గుణాఢ్యా! 88

కుందా! గోవిందా! యర
విందాయతనయన! సాధు♦బృంద ప్రణుతా!
వందారు సనందాది ము
నీందూ! నంద సుత! యింది♦రేశ! ముకుందా! 89

అని బృందావనమున స్త్రీ వృద్ధాదులు పాటలు పద్యంబులు కీర్తనలు మున్నగువానిం బాడెదరు. 90

ఏయింటం జూచిన ♦ హే కృష్ణ! హే రామ!
హే హరీ! యనియెలుం ♦ గెత్తువారె
ఏవీధిం గాంచిన ♦ హృద్య వాద్యములతో
శ్రీహరి గానంబు ♦ సేయు వారె
ఏయుపన్నునం గన్న ♦ బృంద బృందంబులై
కృష్ణా! యటంచుం గీ♦ర్తించు వారె
ఏచోటం జూచిన ♦ నింది రేశా! ముకుం
దా! యంచు భజన యొ♦నర్చు వారె.

ఎల్లెడల నూర్ధ్వ పుండ్రంబు♦లెల్ల యెడలం
దోలసిపేరు, లెల్లెడలను ♦ జెలుంగు బిల్ల

కచ్ఛడములు బృందావన ♦ గ్రామ మెల్లఁ
దల్లిరో! భవ త్ప్రియ రాజ♦ధాని గాదె. 91
తాకు వాకుఁ దలఁచు వారు♦శేక నీ కు
మారకులు జరా భారావి♦దూరులైరి
కొంచె మాత్మ సుఖార్థము ♦ కూర్కు చుండి
రంతియే యలందురకు మ♦మ్మా! యొడంద. 92

## ✻ పరీక్షిత్తు సల్పిన కలినిగ్రహ విషయము. ✻

ఇ శ్లేష బలుక నా సతి
యెట్లూ! యభిమన్యు పుత్త్రుఁ, ♦ డీ కలిగాఁ డీ
పాట్లు పడకుండఁ జెట్లకు,
గట్లకుఁ గట్టి పడవేసెఁ♦ గాదె సురమునీ! 93
నృపతిచేత బంధితుఁడైన ♦ యీ దురాత్ముఁ
డెట్లొ తప్పించుకొని చరి♦యించు చుండ
నఖిల సార మేగతి మాయ♦మయ్యె? నయ్య!
కృష్ణుఁ డీ యధర్మస్థితి ♦ నేటికోర్చె? 94
ఈ నా సందేహంబులఁ
బోనాడుము మిమ్ము వంటి ♦ పుణ్యాత్ముల వా
చా నిర్మలామృతంబుం
బానము సేసి సుఖియించు♦వారము గామే? 95
అనుమాటల్ విని యప్పుడంటె నిటుల♦మ్మా! భక్తి నీ సందియం
బును బాపం గలవాఁడవిన్ము విమలాం♦భోజాక్షుఁ డా కృష్ణుఁ డే
దినమం దీ ధర వీడె నా దినమునం♦దే వచ్చినాఁ డెల్ల సా
ధనముల్ పాడొనరించునట్టికలి మ♦ర్త్య శ్రేణిఁ బీడింపఁగన్.

ఉత్తరపట్టి దిగ్జయ స♦ముద్ధతిఁ బోలుచు నొక్కనాఁడు గో
సత్తముఁ దన్నుచున్న కలి♦జాల్మునిఁ గాంచి యిదేమి? క్రూర! నీ
కుత్తుక నుత్తరింతునని ♦ క్రోధముతో నసిపుత్రి నెత్త వాఁ
డత్తఱిఁ దత్తఱించి శర♦ణంచుఁ బదంబుల వ్రాలె దీనుఁడై. 97
అప్పుడు ఱేఁడు వాని జము♦నంతిక సీమకు నంపఁ బోక యీ
మొప్పియ యున్న నేసుకృత♦ముల్ ఘనయాగము లున్న మూధులుం
దప్పక యీని సత్ఫలము ♦ తాపసశాత్రుని కీర్తనంబున
జ్జొప్పడు నంచు నీ కలి మ♦నుష్యులకై క్షమియించె నాతనిన్.
కలి యున్నప్పు డొకపరి నేన్
జలజనయను కీర్తనంబు ♦ సల్పినఁ జాలున్
దలఁపఁ జిరకాల తపముల
నొలయని ఫలము సమకూరు ♦ నొక్క నిముసమునన్. 99
పూవు కందకుండఁ ♦ బూఁదేనెఁ గొనునళి
బంభరంబువోలెఁ ♦ బార్థివుండు
కలి గతింపకుండఁ ♦ గలి ఫలంబులను గొ
నంగ నెంచె నెంత ♦ నైపుణంబు! 100

వృకంబువోలెఁ గలిపురుషుండు ధేనువులను ప్రమత్తులను బొంచియుండి బాధించుఁగాని ధీరుల నప్రమత్తుల నేమిచేయలేఁడని విష్ణురాతుం డభిమన్యుతనయుండు కలిని స్థాపించెను. ఇఁకఁ బదార్థంబు లసారంబులైన తెఱంగు విమలయోగినుభక్తిదేవితో నిట్లు పలికితి.

### * పదార్థము లసారములైన తెఱఁగు. *

చెడ్డపనుల మిత్రులఁ ♦ జేయు టెందుకు సార
మెల్ల మొదల నుండి ♦ పొల్లు వడితోఁ

బుడమిలోఁ బదార్థ ♦ ములు గింజలేని తు
షమ్ము లట్టులున్న ♦ వన్నె లేదు. 102

కూటి కాసనేసి ♦ గుడిసె గుడిసె లోన
నరుని నరుని కడను ♦ బరమ భాగ
వతము గాథ ద్విజులు ♦ పఠియింప సాఁగి ర
ల్లగుట దాని సార ♦ మారి పోయె. 103

నాస్తికాధములు మ ♦ హా క్రూరకర్ములు
హింసకులును బాపు ♦ లెత్తి వచ్చి
యాక్రమించి యుండి ♦ రా కారణమ్మునఁ
దీర్థ సారమెల్లఁ ♦ దీఱి పోయె. 104

కల్లరీండ్రు వెచ్చ ♦ గాండ్రు ముంగోపులు
నాసపోతులు పిసి ♦ నారి వాండ్రు
హీనులెల్ల వచ్చి ♦ యెగఁబడిరి తపంబు
సార మందువలన ♦ మాఱిఁ బోయె. 105

మనసు గెలువ లేని ♦ మందులు లోభులు
నిష్కృతి పరులు వేద ♦ నిందకులును
శాస్త్ర హీనులు దన ♦ చాయకు వచ్చుట
ధ్యానయోగ ఫలము ♦ మ్లాన మయ్యె. 106

కన్య మిన్నయుంగకే నాతు ♦ కలను గూడి
సుతులఁ బుట్టించుటకు మహా ♦ శూరు లంట
ముక్తి కన్య సాధింప స ♦ శక్తు లంట!
దున్నలోకొ? పాండిత్య సం ♦ పన్నులోకొ? 107

సంప్రదాయాగతమగు వైష్ణవత యెచట
నైనఁ గలికమునకుఁ గూడఁ గాపింప
డకట! యిల్లు ప్రవేశయము ముంచుకొని వచ్చెఁ
గాన వస్తు సారం బెల్ల కడలఁ జచ్చె. 108

అహా! యిది యుగధర్మం
బెవ్వరి నన్న ఫలమేమి? యిది యింతె యటం
చ వ్వనజాత్ముఁడు చూచుచు
నవ్వుచు నున్నాఁడు ప్రతిక్రియ నర్పక ప్రజ్ఞ. 109

అనఁగ భక్తి యిట్టులనె ధన్యురాల నా
వంట వండి నీవు కంటఁ బడితి
సాధు దర్శనంబు సర్వ సిద్ధి కరంబు
గాదె లోకులకు జగత్ప్రపూజ్య! 110

ఆదృతి నీవు పల్కు నుడు లల్లన వీనులఁ జేర్చి కాదె ప్ర
హ్లాదుఁడు గెల్చె దుస్త్యజము నచ్యుతు మాయ నదేల! నీకృపా
శ్రీ దయివాఱఁ గాదె! వసనేఁ ధ్రువుఁ డుత్తమమైన స్థాన మే
నాఁదలఁ గేలు మోక్షసకలార్థ విధాయక! మౌనినాయకా!

నారద! శారద నారద
దారద తార దర శారదా రద దేహా
దారద మారద యోగ వి
శారద సారద వచః ప్రసార దయాబ్ధీ! 112

అని భక్తిదేవి యేమేమియో పలికి నమస్కరించె నని
నారద మహాసీంద్రుండు సనక సనందన సనత్కుమార సనత్సు

జాతులకుం జెప్పెనని సూతుండు శౌనకాదులతో వక్కా-
ణించెను. 113

మంజుభాషిణి॥ నిగమాంతవేద్య! కమనీయ విగ్రహా!
జగదీశ్వరా! సకలశక్తి భాస్వరా!
ఖగ గోప వాహా! కలి కల్మషాపహా!
దిగధీశ మౌళి మణిదీప్త పాదుకా! 114

—: గద్యము :—

ఇది ఉభయ భాషా ప్రవీణ వేదాంతపారీణ మిన్నికంటి
గురునాథశర్మ ప్రణీతంబైన శ్రీ పద్మపురాణోత్తర
ఖండస్థ శ్రీమద్భాగవత మహిమ మందలి
భక్తి నారద సమాగమంబను
ప్రథమాధ్యాయము.



శుభమస్తు.

అవిఘ్నమస్తు.

# శ్రీమద్భాగవతమహిమ.

## ద్వితీయాధ్యాయము.

శ్రీధారాళాద్భృతిగా
ధా! ధరణీధరవరేణ్యా ♦ తల్పానల్పా!
సాధారణ్యేతర భ
క్తాధారాంఘ్రివనజాత ♦ హరిహరనాథా!

అవధరింపు, మవ్వాల సూతుండు శౌనకాదుల కిట్లనియె, నారదుండు సనకాది మహర్షులతో మహాత్ములారా! పిదప వినుండు. నేను భక్తితో నిట్లంటి. 2

### * నారదుఁడు భక్తి నుద్బోధించుట *

ఏల వృథాగ వందురెద ♦ వింతటమాను మనంబులోపలన్
శ్రీ లలనా మనోహరుని ♦ శేషశయానుని హైమచేలు ను
త్తాలభుజా చతుష్టయ సు♦దర్శన శంఖ గదాబ్జరమ్యు గో
పాలుభజింపు మాతఁడె శు♦భంబు లొసంగునడంచిదుఃఖముల్.

బాలిక! మున్ను కౌరవ స♦భాస్థలి సాధ్వి మహాపవిత్రఁ బాం
చాలినిదుష్టుఁడొక్కఁడు రు♦షావశుఁడై మొయిలోకలూడ్చుచోఁ

బాలనముంబొనర్చిన కృ♦పానిధి యిప్పుడు లేఁడటమ్మ ? నీ
వేల దురంత చింతఁ దపి♦యించెద ? వా విభునిం దలంపుమా! 4

పంత మదేల నీకు ? వల♦వంతలఁ జిక్కి కృశించినారమో
కాంత!పరాభవింపకుము♦కావుము చూడుము పేర్మి, మ్రొక్కఁగా
నెంతటివాఁడు నే నఱకు♦నే? కరముల్, హరి! యంచు గోపికా
కాంతలు వేఁడ శ్రీవరుఁడు♦కావఁడె? యాతఁడు నేఁడు లేఁడటే?

అదియును గాక నీవు హరి ♦ కత్యధిక ప్రియభార్య, వాదయా
స్పదుఁడునునిన్నుఁ జూచుఁ దన♦ప్రాణముకన్నను మిన్నగా, భవ
ద్వదనమునుండి యే పలుకు♦వచ్చునో ? దానిని జేయు, నీవు పి
ల్చెదో యతి నీచునింటికిని ♦ జెచ్చెర శ్రీహరివచ్చుఁ గాదటే! 6

"జ్ఞాన వైరాగ్యములు ముక్తి ♦ సాధకములు
మొదటి మూఁడు యుగములలోఁ; ♦ బూజ్యరాలు
భక్తిదేవి యీ కలిని కే♦వలము తానె
బ్రహ్మసాయుజ్య మిచ్చెడి ♦ రాణిసుమ్ము" 7

అనుచు నిశ్చయించి ♦ యానందచిన్మూర్తి
యా పరాత్పరుఁడు ద♦యామయుండు
హృద్యచరిత సుంద♦రిని గృష్ణ వల్లభ
నిన్ను సృష్టి సేసి ♦ నిలిపెనమ్మ ! 8

ఒకనాఁడు శ్రీహరి♦కెదుద్ద నంజలిపట్టి
నిలిచి స్వామీ! యేమి♦సలుపుదాన
నానతిమ్మంచు నీ♦వడుగ నాతండు మ
ద్భక్తులఁ బోషింప♦వలయు నిదియె

కార్యమంచును బలు♦కంగఁ జిత్తమటంచు
నాడితి వందుల ♦ కలరి యతఁడు
జ్ఞాన వైరాగ్యాఖ్య ♦ సూనుల ముక్తినాఁ
బడునొక్క దాసి నే ♦ ర్పడఁగ నిచ్చె

భవ్య వైకుంఠ పురమున ♦ భక్తపోష
ణంబు నైజరూపమునఁ బొ♦నర్చు కొనుచు
నవని భక్తులకొఱకు ఛా♦యా స్వరూప
మమరఁగా సృజించితివి నె♦య్యంబు మీఱ. 9

జ్ఞాన వైరాగ్య ముక్తులు ♦ సరసనుండఁ
బుడమిఁ దిరుగుచుఁ దొలుతటి ♦ మూఁడు యుగము
లమితమోదంబుతోఁ బుచ్చి♦తమ్మ! నీకు
చింత లేమియు లేక ప్ర♦సిద్ధి కెక్కి 10

కలిలోఁ బాషండ మత
స్థులు పీడింపంగ ముక్తి ♦ సుందరి క్షయురు
క్కలిత యగుడుఁ బంపితివా
నెలఁతను మరలన్వైకుంఠ ♦ నిలయమ్మునకుఁ. 11

ఎప్పుడయిన నీవు తలఁచి
నప్పుడు మాత్రమ్మె ముక్తి♦హర్షము మదిలో
నుప్పతిలఁగ వచ్చు మరల
నుప్పరవీదిఁ జనుచుండు ♦ నుదితాజ్ఞ మెయిఁ. 12

జ్ఞాన విరాగాఖ్యుల స
త్సూనులఁ జెంత నిలుపుకొని ♦ చూచెదుకానీ

మానవు లుపేక్ష సేయుట
చే నిప్పుడు వృద్ధులైరి ♦ చేష్టలు నుడిగెన్ 13

ఐనను జింతిలకుమ యే
దైన నుపాయంబు చూత ♦ మంగన! కలినిన్
బోనాడకు దీనికి సరి
యైనది యే యుగము కాద♦టంచు నెఱుఁగుమీ 14

అన్య ధర్మమ్ములను విడ♦నాడి యుత్స
వముల మున్నిడు కొని నిన్నుఁ ♦ బ్రతిగృహమునఁ
బ్రతి మనుష్యుని యందు స్థా♦పన మొనర్తు
నట్లు చేయనో హరిదాసుఁ ♦ డనకు నన్న 15

కలి నే జీవుఁడు నిన్నుం
గలియు నతఁడు ఘోర పాత♦కములు సలిపినన్
జెలఁగుచు భయరహితుండై
యలముకొనుం గృష్ణు మంది♦రాంగణ భూమిన్ 16

ప్రేమ భక్తి యెవని ♦ హృద్వీధి నిలుచునో ?
యమలుఁడగుచు వాఁడు ♦ యముని గనఁడు
దైత్యదానవులును ♦ దయ్యముల్ భూతముల్
భక్తిపరుని దాఁకి ♦ బ్రదుక లేరు 17

జ్ఞానమున నైనఁ గర్మముల్ ♦ సలిపియైన
శ్రుతులు చదివియైనఁ దపంబుఁ ♦ జొచ్చియైన
హరిని గనలేరు భక్తిచే ♦ నరయఁ గలరు
నాకు వ్రేనెలంతలె ప్రమా♦ణమ్ము సుమ్ము 18

ఇలలో సహస్ర జన్మం
బులు దాల్చినఁ గాని భక్తి ♦ పుట్టదెపఁదం
గలి భక్తియె, కలిభక్తియె,
కలిభక్తిం గృష్ణుఁ డెదుటఁ ♦ గంతులు వైచుఙ్ 19

దుర్వాసో ముని సమధిక
గర్వంబున భక్తుఁ దిట్టఁ♦గా నేమయ్యెఙ్?
సర్వ భ్రష్టుండగు నీ
యుర్విఙ్ భక్తులను జెఱచు ♦ నెవ్వండైనఙ్ 20

చాలును వ్రతములు, మఖములు
చాలుఙ్, దీర్థములు యోగ♦చయములు చాలు
న్నాలును జ్ఞాన కథావళి
పోలంగా భక్తి యొకఁడె ♦ ముక్తి నొసంగుఙ్ 21

భక్తి ప్రభావ మిట్టిది
ప్రాక్తన ఋషివర్యు లిట్లు ♦ భాషించిరి నీ
శక్తిని నీవు మఱచి దై
న్యోక్తులు పలికెద వొకింత ♦ యోచింపు మదిఙ్ 22

అనియే నుద్బోధింప స్వమాహాత్మ్య మాలించి భక్తి దేవి క్రమక్రమ ప్రవర్ధమాన సర్వాంగ పుష్టి సంయుక్తయై మహోల్లాసముతో నిట్లనె. 23

బళి! బళి! నారద! నీ యు
క్తుల వింటి న్మదము గంటి ♦ కూరిమి యిటు ని

శ్చలముగ నాపై నీకుం
గలదే! యిది యెఱుఁగ నెప్పుడు ♦ గన్యాఁడ వేపో. 24

ఓ త్రిజగన్నుత! సాధు చ
రిత్రా! నాబాధఁ గనుఁగొని ♦ ద్రెంపవె, యింకం
బుత్రులు నిశ్చేతనులై
ధాత్రిం బడిరి వీరి నే పెంపొదవు గాక దయన్. 25

అని భక్తి ప్రార్థించె నని సూతుండు శౌనకాదులతో నిట్లనియె!

* నారదుఁడు వృద్ధుల మేల్కొల్ప యత్నించుట *

భక్తి సలుపునట్టి ప్రార్థన మాలించి
నారదుండు సద్ఘృ♦ణాపరుండు
కేలఁ దట్టివారి ♦ లే లెండటంచు బో
ధన మొనర్ప సాఁగె ♦ దాపు సేరి 27

లేరా! జ్ఞానా! లేరా!
వైరాగ్యా! లెండు లెండు ♦ వడిగా నని య
వ్వారి శ్రవణ రంధ్రంబులఁ
జేరిచి నోరఱచెఁ జెవులు ♦ చిల్లులు వడఁగన్. 28

ధనధాన్యంబులు వస్తువాహనములున్ ♦ దారాత్మజాప్తుల్ సుహృ
జ్జనబంధుల్ మడిమత్రు గొడ్డులును గో♦దల్ మిద్దెలు నేడలున్
గన నీసర్వము నశ్వరంబె స్థిర మొ♦క్కండైన లే దేల నీ
విశ్రేయించుట మోహమందుటయుఁ గన్ ♦ మేల్కొమ్ము వైరాగ్యుఁడా!

నినుబీడించుచు దుఃఖపెట్టు ప్రజపై ♦ నీకేలరామోహా మొ
య్యావఁగన్పించి క్షణఃబులోనఁగనుచా ♦ టౌ వస్తులంగోరుటా?
వనటన్నీకయి నీవెతెమ్చుకొనుటా! ♦ వైరాగ్య! మేల్కొమ్ము ని
త్యనిరూఢంబగు వస్తువున్నిదకి బ్ర♦హ్మానందముం బొందఁగన్.

ఎన్నఁడో వచ్చి కమ్ముకొని ♦ యెంజుమి నిన్ను నవిద్య దానిచే
నన్నువవాఁడనంచుఁగల ♦ దన్యమటంచుఁగలంకినుచు నీ
వెన్నుకొనందొడంగితి వి♦సీ! తెరఁజిమ్మి స్వభావమారయం
గన్నిను నీవెఱుఁగుకొనఁ♦గన్నులు దెఱ్వుము లెమ్మజ్ఞానుఁడా!

చేరితి వేలరా? కటిక♦చీఁకటిలోన హృషీక మెద్దియుం
దూరని తావునన్ సుఖమొ? దుఃఖమొ? తోఁపనిగీమునన్ దమః
పారము ముట్టిపాడవున♦వస్థలదాటి స్వయంప్రకాశ రే
ఖారుచిరుండవయ్యెదవు♦గాక సుషుప్తిని పీడు జ్ఞానుఁడా!

దొరవయియుండి యయ్యహము♦తోఁ జెలికార మొనర్చితప్పె మె
మఱచితివంతనిన్నుఁబడి♦మందియు నైదఱలున్న పెద్ద పం
జరమునవై చిరావయిఁ బొ♦సంగిన విట్టి యవస్థలెల్ల నీ
మఱకువ మట్టిగాను కొఱ♦మాలిన నిద్దుర లెమ్ము జ్ఞానుఁడా!

కలహృద్వీధినిగొండనెక్కిన భవ♦త్కాయంబుఁగన్గొందు వా
వలఁగన్నుల్ దెఱవంగ మంచమువయిం♦బన్నుండి యేయుండు వ
క్కలలోఁగొండకునీకు నాదరువెదో?♦కన్గొన్న దెవ్వండో? యె
ట్టులో? యేతావుననుండియో? యరయఁడో? క్షోలేవరా జ్ఞానుఁడా!

కలలో వేఱుగనున్న నీదుతనువుం•గన్గొంచు నున్నాఁడ వ
త్తులతోఁ జూడవొ? ప్రాతిభాసిక జగ•త్తోఁ గూటంబలెంజూవిభా
సిలు జాగ్రద్దశలోను నిపకలవిరా•చిత్రంబు మూలస్థితిం
దెలియంగన్నులు విచ్చి మేలుకొను సు•ప్తిక్షీవీడు లే జ్ఞానుఁడా!

చెన్నటి దేహబంధమునఁ•జిక్కినఁ జిక్కితి కీడులోన మే
లన్నటు లీశరీరమెస•లారిన యిప్పుడ దేవులాడు కొ
మ్మన్న వరమ్ము పిమ్మట ర•వంతయు లాభము లేదు నిద్రలం
గ్రన్నన నైహికంబులను•గాలముఁ బుచ్చక లెమ్ము జ్ఞానుఁడా!

ధారుణినైన, ధర్మసము•దాయము చే దివినైన నింద్రియ
ద్వారముచే లభించుసుఖ•వర్గము నిత్యముగాదు వెండియుం
జేరుచు మాతృకుక్షితతిఁ•జీ! యిటు క్రిందికి మీఁదికాసులో
దారమునాఁ జరించెదవె•తానది చాలును లే విరాగుఁడా!

అని యిట్లెన్నెని గతుల నారద భగవానుండు మేల్కొల్పు పాడెను.

వేదాంత వేద గీతా
వాదంబులు పెక్కుమార్లు • వచరింపఁగఁ ద
న్నాదంబులు చెవులం బడి
మోదించి కదల్చి రంగ•ముల నెల్లెట్లో. 29

తనువులు కదలిన వంతే
కనులు దెఱవరావు లింత్రు•గాసిం బడి మొం
డిన కట్టెపుల్లలై యుం
డినవంగము లింక నెన్న•టికి బలిసెడినో! 30

లులితంబులు ప్రాయంబులు
గలితంబులు రుధిర మాంస ♦ ఖండగణమ్ముల్
వలితంబులు కేశంబులు
చలితంబులు గావె ప్రాణ ♦ చయ మెట్టొకో. 31

అట్టి స్థితిలోనున్న జ్ఞాన వైరాగ్య లిద్దఱు మరలస్వావ
పరాయణులు కాఁగా నారదుండు. 32

అరరే! యేమిఁక నేమి చేయుదును సత్త్వారంభముల్ నీటి య
క్షరముల్ గాఁదొడఁగెన్, మహోగ్రతరమై తీవ్రమ్మై జరా నామ
దుస్తరరోగం, బటుపైని గాఢతర నిద్రా దేవి పీడించు, ని
ద్దఱు, నిద్దురఁ బాపనేరఁ గద్దా? యొందు పాయంబిలన్

బిట్టు జచితిః జెవి చెంగటఁ
దట్టితిఁ గదలించితిం బదంబులు కరముల్
పట్టి తిగిచితిం జెవిమొర
వెట్టితి గిల్లితిని గనులు ♦ విప్పరజేమో? 34

తూర్చి కరము తలక్రిందం
గూర్చుండం బెట్టఁ బ్రక్క ♦ కుం దల యొఱగున్
వర్చస్సాకల, డిఁకనా
నేర్చినయది లేదు వీరి ♦ నిద్దుర వావన్. 35

ఎటుసూచిన నాకుఁ దెలివుదోఁచదు. ఇప్పట్టున నాకు
శ్రీహరియె దిక్కని వార్చి శుచియై హరిని ధ్యానింపఁగా. 36

## * వ్యోమవాణి *

వలదుమునీంద్ర! శోకము భ♦వత్కృత యత్నము పండనున్న దిం
దుల కెద సంశయింపకుము ♦ తోష మెలర్పఁగ నేతదర్థము
జ్జ్వల తరమౌ సుకర్మమును ♦ సల్పుము దాని నొనర్చు వైఖరిం
దెలుపఁ గలారు నీకు గడి♦ దేఱిన సాధులు మౌనిపుంగవుల్ 37

ఆ సత్కర్మము నీవుం
జేసెదవే క్షణములో న♦శించును నీదిం
గాసి పఱచు జరయు నిదుర
భాసుర భక్తియును దిరుగఁ ♦ బడి దెస లందున్ 38

అని గగనవాణి పలుకఁగ
వినినాఁడను జెవులు దోర ♦ వెట్టి మహాతి న
ల్లనఁ గావివలువ మాటుచు
మనము నిలిపి యెవఁడు దేవు♦మాయ నెఱుంగున్ 39

అంతట నే నమిత విస్మయ గోచర మానసుండనై యిట్లు తలఁచితి. 40

ఇట్టులు వ్యోమవాణి వచి♦యించుట యేటికొ? గోపనంబు గా
నట్టి సుకర్మ మెయ్యదియొ? ♦ యయ్యది నా కెవరాన తిత్తురో?
పట్టుగ నేను దాని సలు♦పన్ మఱి నీరల నిద్రవాయునా?
యెట్టి విచిత్రముల్ జరుగు! ♦ నీశ్వరు లీల లనేక వైఖరుల్ 41

అని పెద్దయుం బ్రొద్దు విచారించి యవ్వల నవ్వా! వింటివిగదా! ఊఱడిల్లుము. ప్రతీక్షించు చుండుము. అని యే నవ్వారల నచ్చటన వదలి తదర్థంబై ప్రతి పుణ్య తీర్థంబున

కరుగుచుఁ గొంటుంబడిన భక్తి ముక్తులు నాకాశవాణి చెప్పిన
సత్కర్మ సాధనంబు నడుపుచుఁ దిరుగుచున్నాఁడ. 42

ఒక్కఁడు కనువిచ్చి ♦ చక్కఁగా నాలించు
నొక్కఁడు వ్రేలించు ♦ ముక్కుపైని
ఒక్కఁడు కడచూపు ♦ నప్పుడు జెగయించు
నొక్కఁడు నాలుగు ♦ దిక్కులుగను
ఒకఁడేమి పలుకక ♦ యుస్సి చూచుచు నుండు
నొకఁడు కాలికొలంది ♦ నోసరిల్లు
ఒక్కఁ డర్థము దీసి ♦ కున్నదే? యని పల్కు
నొకఁ డసాధ్యపుఁ గర్మ ♦ మోయి యనును
ఒకఁడు నారదా! నీయంత ♦ యోగివరుఁడె
తెలియ లేఁడేని మే మెటు ♦ తెలుపువార
మంచుఁ గేల్మోడ్చు మఱియొక్కఁ ♦ డరుగవయ్య
బదరికా వనంబునకంచుఁ ♦ బలికి పోవు. 43

ఇంతట నంతటఁ బడి జగ
మంతయు నీ వార్త ప్రాఁకె ♦ హా హాకారా
క్రాంతము లయ్యె సమస్తా
శాంతంబులు దిక్కు దోఁప ♦ దాయె నెవరికిన్ 44

ఎంతటి వింత శ్రుతులు వే
దాంతంబులు గీతగూడ ♦ నచ్చట నిద్రా
కాంతిఁ దొలఁగింపవో యుపా
యాంతర మింక లేదటంచు ♦ నాడిరి జనముల్ 45

సామాన్య స్వావము గా
దీ మనుజులఁ జుట్టుకొన్న ♦ దిది యెట్లగునో
దామోదరుఁ డే సుకృతిఁ
భూమిని నెలకొలుప నిట్లు ♦ పుట్టించెనొకో! 46

సదయ మతులార! యిట నట
మెదలిన లాభంబు లేద ♦ మేయ తప స్సం
పదల నిది యొదవఁ గదిసెద
బదరీ వనము న్మునీంద్ర ♦ వరసేవనముఁ 47

అని తలంచి తద్దర్శనాభిలాషంబునం బయనించినతోడనే.

* నారదుఁడు సనకాదుల నుపాయ మడుగుట *

మునివర్యులార! మీ దరి
సెన మస్మద్భాగ్య వశము ♦ చేత లభించెఁ
జని ధన్యం బయ్యెను స
జ్జన సందర్శనము రిత్త ♦ సాఁగ దెఱుఁగుదుఁ. 49

నాలుకపై నర్తించు
న్నాలుగు వేదములు, యోగి♦నాథులు తమ పా
దాలకడ వ్రాలుదురు ధీ
శాలిత్వము నందు మీకు ♦ సాటి యెఱుంగఁ 50

ఐదేండ్ల ప్రాయమే సృ
ష్ట్యాదిం బుట్టినను మీకు, ♦ ననవరతము కా
లా ఢిష్టయయ్యు దరియఁగ
రాదు జరాదేవి హరి శ♦రణ్యుల మిమ్ముఁ. 51

బళిరే! నారద! పుణ్యవంతుఁడవు శాశ్వతాత్మాధు వైరాగ్య వంతులలోనం దల మానికంబవు, సుధాంధో వర్గమేయేల? యోగులు సందేహము దీర్చికొందురు వినుం గొండాడి శ్రీకృష్ణ భక్తుల సేవే ప్రథమాభిగణ్యుఁడ వెఱుంగుమన్మనః పద్మముల్ 58
భక్తికొఱకుఁ బాటు పడు నీవు నబ్బుర
మందు ఘనులు లోకమందుఁ గలరె?
యెట్టులైన భక్తి నిల స్థిరంబుగ నిల్పఁ
దలఁచు చుందు కృష్ణ దాసవరులు. 59
యమివర్యుల్ ప్రకటించిరీ ధర ననేకాధ్వంబు, లవ్వెల్లయుక్ శ్రమసాధ్యంబులె. యట్టులయ్యు నవి స్వర్గంబె ప్రసాదించు. ను త్తమ వైకుంఠమునిచ్చు మార్గమతి గుప్తంబయ్యె, యీదీనిబోధముచేయంగలవాఁడు ఓక్కటమునీంద్రా! యెంతభాగ్యంబొకో.
మును వ్యాసు వాణి వెలువడి
చిన సత్కర్మమ్ము నిప్పుడు చెప్పెదము భవ
న్మనమును స్థిరముగ నిలిపితె?
యనఘా! బుద్ధియుఁ బ్రసన్నమై యున్నదియే? 61
వినుము. ద్రవ్యయజ్ఞము తపోయజ్ఞము యోగయజ్ఞము స్వాధ్యాయ యజ్ఞము జ్ఞానయజ్ఞము మున్నగునవి కర్మ విసూచకమ్ము లెన్నియేని యుం గలవు. 62
అందు సత్కర్మ సూచకం బైన జ్ఞాన
యజ్ఞ మా శుకాదులు పాడి నట్టి భాగ
వత పురాణ కథాను లాపమ్మ యంచు
నఖిల దర్శనుల్ బుధు లందురయ్య నిజము. 63

భక్తి జ్ఞాన విరాగుల
శక్తి తదుద్ఘోషమునకె ♦ సమధిక ముగు నా
వ్యక్తులకుఁ గష్ట సుఖములు
భక్తివలనఁ గలుగుచుండు ♦ బ్రహ్మ కుమారా! 64

సింగమ్ము బొబ్బ వెట్టం
గం గోకములు పరువెత్తు ♦ కైవడిఁ బరువె
త్తుం గలిదోషములెల్లన్
ఖంగున భాగవత కథ మొ♦గసి చెవిఁ బూనన్. 65

అపుడు ప్రేమ రసావహ ♦ మైన భక్తి
జ్ఞాన వైరాగ్య సుతులను ♦ జంక విడిచి
వడిగ నింటింటికిని వచ్చి ♦ ప్రతి మనుష్యు
తోడఁ గ్రీడించుఁ దనయులు ♦ జోడు లేక. 66

అని సనకాదు లాదరంబున జ్ఞాన వైరాగ్యు లుత్థితు
లగు తెఱఁ గాకర్ణింప. 67

ఆపై నారదుఁ డిట్లు పల్కె మునులా♦రా! వేద వేదాంత గీ
తా పాఠంబుల నెంత తెలిపినను సు♦ద్రల్ లేవరై రప్పుడీ
పాపల్, భాగవతంబులోనఁ బ్రతి శ♦బ్దంబందు వేదార్థమే
దీపించుం గద నిష్టమాత్ర మొటు సు♦ప్తిం బాతుకే తద్ధ్వనిన్.

సత్సాధులు శరణాగత
వత్సలు లవ్యర్థభవ్య ♦ వచనులు మీరే
తత్సమయమ్మునఁ దీర్చుఁడు
మత్సంశయములను సుగుణ ♦ మండనులారా! 69

* సనకాదు లెట్లు భాగవతము మిన్నయో నుడువుట. *

అని పల్కఁ గుమారు లిట్లనిరి. 70

వేదోపనిషత్సారా
పాదిత మగుటఁ జుమి భాగ♦వత ము త్తమ రే
ఖా దీక్షితమయ్యె ఫలో
త్పాదనముం గూడ వేఱు ♦ వడియే యందుఁ. 71

క్షీరస్థిత ఘృతంబు ♦ చేతి కందదు పృథ
గ్భూతమై సురలకుఁ ♦ బుష్టినిచ్చు
చెఱకు గడలలో వ♦సించుఁ జక్కెర దాని
వెలువ రించిన నది ♦ ప్రీతినిచ్చు
త్రావంగఁ జేతి కం♦దదు గాని సార పూ
మూలాగ్రముగ శాస్త్ర♦ములఁ దనర్చు
నా రసం బెట్టులైన ♦ వేఱు చేయుదు మొ వి
శ్వ మనోహరంబైన ♦ ఫలము నిచ్చు

వేదసార మెల్లఁ ♦ బిడిచి పిడిచి సిద్ధ
పఱుపఁ బడినదయ్య ♦ భాగవతము
కాన వేద మీయ ♦ లేసి ఫలంబును
భాగవత మొసంగ ♦ వలఁతి సుమ్మి. 72

జ్ఞాన భక్తి విరాగాభి ♦ ధానులను స్థి
రంబుగా భూమి నిల్పు కా♦ర్యంబు కొఱకు
బ్రహ్మ సమ్మితంబైన యీ ♦ భాగవత మ
హా పురాణ సారము చెలు♦వారె నయ్య. 73

అధిముఖోత్కర్షనములు
సాధీయ స్తాత్త్వికో క్తి ♦ సవిమర్శనముల్
బోధసుధాస్పర్శనము ల
సాధారణ సాధులోక ♦ సందర్శనముల్. 80

మావంటి సంశయాత్ములఁ
గావంగాఁగాక యేమి♦గావలెనని మీ
రీ వసుధఁ దిరిగెదరు ? మీ
జీవితము పరోపకృతికి ♦ స్థిరకుడిపో మొక్కా. 81

అని నారదుండు సనకాదులం గొండాడెనని సూతుండు శౌనకాదులకుం జెప్పెను. 82

తోటకము. ధరణీ తరుణీ సుఖ ♦ దాన చణా !
కరుణా వరుణాలయ ♦ క్రమగుణా !
పరమాదర మానిత ♦ వైశ్రవణా !
వరదా పురదానవ ♦ భంగరణా ! 83.

—: గ ద్య ము :—

ఇది ఉభయ భాషా ప్రవీణ వేదాంతపారీణ మిన్నికంటి
గురునాథశర్మ ప్రణీతంబైన శ్రీ పద్మపురాణోత్తర
ఖండస్థ శ్రీమద్భాగవత మహిమ మందలి
భ క్తి నా ర ద స మా గ మ ం బ ను
ద్వి తీ యా ధ్యా య ము.

శుభమస్తు.
అవిఘ్నమస్తు.

# శ్రీమద్భాగవత మహిమ.

## తృతీయాధ్యాయము.

శ్రీమహిత ధరోదిత క
న్యామందస్మేర భాసు♦రామలగండ
శ్రీముకుర ఫలిత మృదుజే
హా! మథితాసుర సమూహ ♦ హరిహరనాథా!

అవధరింపు మవ్వల సూతుండు శౌనకాదులతో నిట్లనియె. అట్లు నారదుండు సనకాదులం గొండాడి మఱియు నిట్లనియె. 2

శుకశాస్త్ర కథాలలిత
మ్మకలంకము జ్ఞానయజ్ఞ ♦ మతియత్నముతో
నీకఁ జేయుదు మునులారా!
ప్రకటింపఁగ జ్ఞానభక్తి♦వైరాగ్యములన్. 3

జన్నమెటం బొనర్తు! శుక ♦ శాస్త్ర మహత్త్వపటుత్వమెద్ది? యే
నెన్నిదినాలు భాగవత ♦ హృద్యకథావళి నాలకింతు? నే
మున్నదియో విధానము స♦ముత్సుకతం బొనరింప? నాకు నీ
యన్నియుఁ దెల్పరయ్య నిగ♦మాకృతులార! నమస్కరించెదన్. 4

### * సనకాదులు భాగవత యజ్ఞస్థలము నిరూపించుట. *

అనవుడు సనకాదులు మే
ఘ నినాదము కరణిఁ బల్కఁ♦గా నాఁగిరిటుల్
వినయవివేకంబులు వెల
సిన నారదమహాస! విను వ♦శీకృతమతివై. 5

కలదుగదా చలిమల యం
గ్రములకడ యాగియహోమ♦కుండోద్భవధూ
మలధూమవ్యాప్తద్యు
స్థలి గంగాద్వార మమర♦సంచారమ్మై. 6

ఎచటి గంగమతల్లి ♦ హృదయేశుఁబూజింప
నురువు దబ్బలు వడఁ♦బరువులెత్తు
ఎచట దక్షుండు వి♦శ్వేశ్వరు నోనాడి
యజ్ఞదీక్షావస్త్ర♦మందుకొనియె
ఎచట నుచ్చావచ♦దృషదనీకమ్ము లిం
గాకృతిఁ బ్రజకుఁ బ్ర♦త్యక్షమగును
ఎచ్చట శ్రీకృష్ణు ♦ డెల నవ్వు దోఁప మా
యా దేవితో ముచ్చ♦టాడుచుండు
ఎచటఁ జలిమల చల్లని♦దృష్టివఱపు
నెచటి బ్రహ్మకుండము కీర్తి♦కెక్కి యుండు
రెచ్చట భవాని సౌశీల్య ♦ మేపుసూపె
నదియె సుమ్ము గంగా ద్వార♦మనఘ చరిత. 7

గంగాద్వార సమీపము
నం గల దానందవతటము ♦ నవ్య లవంగి

కరువలికి దారి బత్తెము♦గాఁ గొలంకు
కమ్మ చెమ్మ తావుల మూట♦గట్టి పంపుఁ
బాంథులకు బాటఁ బువ్వులు♦పఱచు లతలు
తతకుటము నందు నాసంద♦తటము నందు. 10

నిచ్చలు వేల్పుమూక హవి♦నిం దిన వచ్చుచు నాడఁ జూడఁగా
ముచ్చటయైన తమ్ముల స♦మూలముగాఁ గొని పోయి మింటిపై
వచ్చెడి వాక నాటుకొని ♦ వారలకుండిన పైఁడి తమ్మిని
ప్పచ్చరముం దలఁగి రెన♦వచ్చునె? నాకము తత్తఱంబుతో. 11

ఆ మహితస్థలి సలుపుము
కోమల సైకతము పైని ♦ కూర్చుండి యపూ
ర్వామల రసపూర్ణకథా
గ్రామము తో జ్ఞానయజ్ఞ♦కార్యము వరాసీ! 12
తన ముది వగల నిరువురు
తనయులఁ గేల్వట్టి భక్తి ♦ తరుణి యచటికిన్
జనుదెంచు భాగవతముం
డిన తావుల నెల్ల వీరి♦నివసన ముండున్. 13

మునీంద్రా! భాగవత కథా శ్రవణ మాత్రంబున నా భక్తిజ్ఞాన వైరాగ్య నామకులు ముగ్గురు నవయౌవన విరాజితు లయ్యెదరని కుమారులు చెప్పిరని సూతుండిట్లనియె. 14

ఆ రీతి సనకాదులు
నారదునకుఁ జెప్పి కథ వి♦నం గంగా
తీరమున కరుగుదము మా
తో రమ్మా! యనుచుఁ జనిరి ♦ తోడ్కొని మౌనిన్. 15

## * గంగాతీరమున భాగవత సప్తాహము జరుగుట *

ఎపుడు తత్త్వమునకు ♦ నెసఁగు భాగవత క
థా గోష్ఠియను మాట ♦ రేగినదియొ
యపుడె ముల్లోకమ్ము♦లందు నా వార్త ప్రాఁ
కె, నింకేమి చెప్పుదు ♦ ననఘులార!
తత్కథామృతమును ♦ ద్రావెడు నాసచే
వైష్ణవుల్ సంభ్రమముగాఁ ♦ బయ్వలిడిరి
గౌతము చ్యవన మే♦ధాతిథి భృగువులు
దేవరాత వసిష్ఠ♦దేవలులును
గాధిపట్టి రాముండు శా♦కలుఁడు పిప్ప
లాదుఁడు మృకండుసూనుం ♦ డత్రిజుండు
వ్యాసుఁడు పరాశరుండు ఛా♦యా శుకుండు
జహ్ను జాజలి ముఖ్యు ల♦చ్చటికిఁ జనిరి. 16
అవనిఁగల సర్వమునులు శి♦ష్య ప్రశిష్య
మిత్ర పుత్ర కళత్ర స♦మేతు లగుచు
భాగవత కథామృత రస♦పానలుబ్ధ
బుద్ధులౌచు గంగా తీర♦మునకుఁ జనిరి. 17

మఱియు మూర్తిమంతంబులై నాలుగు వేదములు వేయునెనిమిది ఉపనిషత్తులుఁ బదునేడు పురాణములు నాఱు శాస్త్రములు నెనిమిది దిక్కులు నేడు కులపర్వతములు గంగాది పుణ్యనదులుఁ బుష్కరాది సరోవరంబులు దండకాది వనంబులుఁ దిరుపతి శ్రీరంగాది పుణ్యక్షేత్రంబులు నచటికిఁ జేరుకొనియె. మఱియు దేవగంధర్వ సిద్ధసాధ్యాదులు నచటి కేగిరి. ఇంకను

గురుత్వాకారణంబుసంజేసి నడువం బాలుమాలిన వారిని భృగు
మునీంద్రుండు ప్రబోధించి ప్రోత్సహించి పంపించె. 18

కృష్ణ! కృష్ణా! యని ♦ కృష్ణుని స్మరియించు
చరుగు దెంచెడి సన♦కాదులకును
నలువుర కెల్లరు ♦ నారదు ముందుంచు
కొని యర్ఘ్యపాద్యాదు ♦ లనువు పఱచి
యోగ్యాసనంబుల ♦ నుపవిష్టులంజేసి
తామునుండిరి యుచి♦తస్థలముల
నందు వైష్ణవులు స♦న్యాసులు బ్రహ్మచా
రులు విరక్తులు ముఖ♦స్థలమునందు
నారదర్షి మున్నిడికొని ♦ కూరుచుండి
రొక్కయెడఋషుల్ సురలు వే♦ఱొక్కయెడను
శ్రుతు లుపనిషత్తు లొకయెడ ♦ సతులొకయెడ
నొక్కయెడఁదీర్థములు వెలుఁ♦గొందుచుండె. 19

పొలిచెన్ జయజయ శబ్దం
బులు శంఖారావములు న♦మోనమయును పె
న్నులివులు; చల్లిరి సూనం
బులలాజలవివిధ చూర్ణ♦ములు సభలోనన్. 20

ఎందఱో విమానములపై
బృందారకులటకువచ్చి ♦ వెదచల్లిరి యా
నందమ్మున నందనహరి
చందన మందారజ ప్ర♦సవ బృందమ్మున్. 21

### * సనకాదులు భాగవత మహిమము నుడువుట. *

ఈ మాటకు సంతసించి
సామోదముతోఁ దనుండె ♦ నా సనకాదుల్
శ్రీమద్భాగవతముగా
భామాహాత్మ్యంబు నుడువఁ♦దలకొని రెలమిన్. 22
వ్యాసనందన శాస్త్ర♦భావమేము
పలుకుచున్నార మదివిన్న♦వారలకును
నారదాది మునీశ్వరు♦లార! ముక్తి
కామినీమణి కరతల♦స్థామలకము. 23
దేని విన్నమాత్ర ♦ శ్రీనాథుఁడరుదెంచి
చిత్తమందు గుదురు♦చేసికొనునో ?
దాని భాగవతము ♦ మానితంబును సేవ
సేయుఁడయ్య ! సేవ ♦ సేయుఁడయ్య ! 24
పదిరెండు స్కంధములతోఁ
బదునెనిమిది వేల శ్లోక♦పరిమితితో నొ
ప్పిదమై శుకుఁడు నుడువ నా
స్వదింపరే, పలరె భా♦గవతము వినుఁడీ! 25
జనుఁడు తెలివిలేక ♦ సంస్మృతిఁదిరుగుట
భాగవతము చెవులఁ♦బడమిపట్టె
వినఁగనేల శాస్త్ర♦మును శాస్త్రమును ముక్తి
నేనయిత్తునంచు♦నిద్దిచాటు. 26
భాగవతము పొలుచు ♦ భవనంబుతీర్థ స్వ
రూప మచటివారి ♦ పాపమడఁగు.

భాగవతము విన్న♦వారి పాపములా క
ళేబరమున నుండ♦లేక పఱచు. 27

వాజపేయశతము ♦ వాజిమేధ సహస్ర
మొక్క ప్రక్క మఱొక♦ప్రక్క భాగ
వతము పెట్టితూఁచ ♦ బహ్వాంతరము దీని
పదియు నాఱవకళ ♦ పాటిరా దవి. 28

పుణ్య గంగయైనఁ ♦ బుష్కరమైనఁ బ్ర
యాగమైన వార♦ణాసియైన
నక్షయ గయ యైన ♦ నా శుకశాస్త్ర స
త్కథల ఫలము సమము ♦ కావు కావు. 29

తమకుఁగలదేని యత్యు
త్తమ గతికింజనఁగ వాంఛి♦తము చదువుండా
స్వముఖమున భాగవత పు
స్తమునన్ శ్లోకార్థమేని ♦ చరణం బేనిన్. 30

భాగవతమె వేదాదియు ♦ భాగవతమె
ద్వాదశాక్షర దివ్యమం♦త్రమ్ము, భాగ
వతమె పౌరుష సూక్తమ్ము ♦ పరమభాగ
వతమె వేదమాతయుఁ ద్రయి♦భాగవతమె. 31

అయ్యా! ద్వాదశాత్ముండు సంవత్సరాత్మకంబైనకాలంబు ప్రయాగ సురభి తులసి ద్వాదశి బ్రాహ్మణుండు వీతిహోత్రుండు వసంతుండు పురుషోత్తముండు భాగవతంబె. ప్రాజ్ఞులు వీనిం బృథగ్భావంబునం బరికింపరని దృఢంబుగా నమ్ముము. 32

అనిశ మెవఁడు భాగవతం
బున కర్థము చెప్పునతఁడు ♦ పూర్వం బొనరిం
చిన కోటి జన్మముల యఘ
ము నాశముం బొందు తేవ్ర♦పో సంశయముల్. 33

రాజసూయాశ్వమేధాధ్వ♦రములు సేయ
నెట్టి పుణ్యంబు లభియించు♦నట్టి పుణ్య
మబ్బు నిత్యంబు శ్లోకార్థ♦మైన శ్లోక
పాదమైనఁ జదువ భాగ♦వతము నందు. 34

తులసీ పోషణమును సుర
భులసేవనమును త్రివిక్ర♦ముని చింతనముఁ
జిలుక జడదారి కబ్బము
నెలమిం జదువుటయు సమము ♦ ఋషికుల తిలకా! 35

అంత్యకాలమందు ♦ నవశంబుగానైన
శుకుని పలుకు చెవిని ♦ జొచ్చెనేని
వానిఁ బాఱఁజూచి ♦ వైకుంఠమునకు గొం
పోవునాదరమున ♦ శ్రీవిభుండు. 36

బంగారపు సింగముతో
రంగారెడు నీ పురాణ♦రత్నము దానం
బుం గావింపఁగ వైష్ణవ
పుంగవుల, కతండు విష్ణు ♦ మూర్తింగలయున్. 37

పుట్టుకఁదొట్టి యెప్పుడును♦బూజ్యము భాగవతంబుఁ జేతితో
ముట్టని మానవాధముఁడు♦పుల్కసుఁడో! వెలిగాఁడయో! యినీ

యట్టి నికృష్టజన్మమది ♦ వ్యర్థముగా, తనకన్నతల్లికిం
బుట్టెఁడు శోకమిచ్చి కడు♦పుం జెడఁబుట్టినవాఁడు గాఁడొకో. 38

ఎన్నఁడు గూడ భాగవత ♦ మించుకయుం జెవిఁ జేర్పఁ డేని యా
చెన్నఁటి పుర్వు పాతకుఁడు ♦ జీవముతోడి శవంబు భూమియా
దున్నను మోయలేక కడు ♦ దుఃఖము నెందును వానిఁగూర్చి యే
మన్నను గూడ దోసమెసు♦మా తలపందగ దట్టి దుష్టునిఁ. 39

అని దేవసమాజముఖ్యులు దివిం బలుకుచుందురని సనకాదులు మును లెల్లరు వినుచుండ మఱియు నారదునితో నిట్లనిరి. 40

కోటి జన్మములందుఁ ♦ గూర్చినపుణ్యము
నక భాగవతము వి♦నంగఁజాల
రటులైనఁగడుయత్న♦మాచరించి వినంగ
వలె నవకాశంబు ♦ వదలఁ గూడ
దానాఁడె యీనాఁడె ♦ యది వినవలెనని
నియమమ్ము లే, దెప్పు ♦ డయిన సరియె
సత్యమాడుచు బ్రహ్మ♦చర్యవ్రతస్థులై
వినుట సర్వోత్తమం ♦ బనఘ చరిత
దాన మానసజయము పెం♦పూనఁగాన,
బహుతిథంబగు కాలమా ♦ పగిది దీక్ష
పూని వినఁగ నశక్తులౌ ♦ పురుషు లేడు
దినములందైన వినవచ్చు ♦ ననియె శుకుఁడు. 41

మాఘమున నెలనాళ్ళు నే♦మమున విన్న
ఫలము చేరు సప్తాహ శ్ర♦వణమువలన

మఱియుఁదపములు యోగ స♦మాధులిడని
ఫల మనాయాసముగ దీనఁ♦బడయవచ్చు. 42
మనసుం గెలుచుట కష్టము
మనుగడ స్వల్పంబురుక్స♦మాజమువలన
జనులకుఁగలిబహుదోషము
లనుగూర్చునటంచు ముని వే♦లార్చెఁదీనన్. 43
ఘనతపముకంటె సప్తాహ గర్జయదిగో
క్రతువుకంటెను సప్తాహ ♦ గర్జయదిగో
వ్రతము కంటెను సప్తాహ ♦ రావమదిగో
మించి తీర్థమ్ము నది బొబ్బ♦రించు నదిగో. 44
ధ్యానమును మించి యోగంబు♦దాటి జ్ఞాన
మలఁతిఁజేసి గర్జించు స♦ప్తాహ మదిగో
అన్నిటికి మిన్న సేన సు♦మ్మంచు బొబ్బ
రించు సప్తాహ మదె బొబ్బ♦రించు వినుము. 45

అని భాగవత సప్తాహ ప్రభావమ్ము సనకాదులు నారదాదులకుం జెప్పిరని సూతుండు పలుక శౌనకుం డిట్లనియె. మహాత్మా! తమ రిప్పుడు జ్ఞానాది ధర్మమ్ములను గణించి సాశ్చర్యంబైన కథానకముం జెప్పితిరి. నిశ్శ్రేయస మొసంగుశక్తి భాగవత పురాణమునకుఁబుట్టిన తెఱంగు సెలవీయ వేఁడెదనన సూతుండిట్లనియె. 46

* సూతుండు భాగవతమునకు శక్తికల్గిన తెఱఁగు సెప్పుట *

శ్రీకృష్ణదేవుఁడీ భూ
లోక మెడలి స్వపదగమన ♦ లోలతఁగనఁగా

నేకాదశమును వినియు సు
శ్లోకుం డుద్ధవుఁ డిదం వి♦భుం బ్రార్థించెన్. 47

అరవిందాయత నేత్ర! భక్తజన కా♦ర్యంబీవు గావించి యీ
ధరణిం బాసి చనంగ నెంచితఁటె? యే♦తద్వార్తమచ్చిత్తమున్
బఱియల్ వాయఁగఁ గోసివైచినది నా♦బాధం దొలంగించి ని
ర్భర సంతోషముఁ గూర్చిపోఁగదె జగ♦ద్భద్రాను సంధాయకా!

తమ రజు గెత్తఁగా నె ప్రమ♦దంబున రాఁగలిగాఁడు వాఁడు గో
దుముకుచున్నవాఁ, డతని♦దోర్భ్యగ మండగ దుండగీంద్రిలా
రమణిని సాధులన్మిత్రుల♦రాయిడి పెట్టెద, రీనృశంస భా
రము వహియింపఁజాలక ధ♦రాసతి గోవయి యేరి వేఁడెడిన్? 49

ధారిణి కీవుగాక వేఁడు ♦ త్రాత? శ్రితాళి భవద్వియోగ మే
తీరున నోర్చుకోఁ గలదు? ♦ దేవ! ధరన్విడఁ బోకుమా! నిరా
కారుఁడవైన నీవు త్రిజ♦గంబులు గొల్వఁగ లేవటంచు సా
కారుఁడవై వెలింగెదవు♦గా కరుణామయ! భక్తరక్షకై. 50

ఓ సకలేశ! మా మదు ల♦యోక్షణమైన నిరాశ్రయంబుగా
భాసిలు చుండలే, వెపుడు ♦ వర్విడుచుండు, నీఁ కెట్లు నిర్గుణో
పాసనముం బొనర్తు? మతి♦భార, మొఱింగియె దీని నీవు మా
యా సముపేతతన్ బహువి♦ధాకృతులం గనుపట్టెదీశ్వరా! 51

ఈగతి నుద్ధవుండనఁగఁ ♦ గృష్ణుఁడెదం దలపోసె, నిప్పుడే
నేగిన వీఁడు చెప్పి నటు♦లే యగుఁ గావున నట్లు గామికై
నా గురుతేజ ముంచెద ఘ♦నంబగు భాగవతంబునందు నా
పై గమనింతునంచు శ్రిత♦పాలకుఁ డట్లయొనర్చె శౌనకా! 52

పావనమైన భాగవత ♦ వాఙ్మయము నందు మురారి సత్కృపా
శేవధి యాత్మకారమున ♦ జేరుట చేతనె వర్ణవర్ణముల్
జీవరసంబుతోఁ గలుకుఁ ♦ జేసి పఠించిన విన్నఁ జూచినన్
సేవ యొనర్చినం గలుగ ♦ శ్రేయము; లాఁకుచు సర్వపాపముల్ 53
శ్రీహరి యింపుంబడె న స
ప్తాహ శ్రవణంబు మిన్న ♦ యయ్యె సమస్త
వ్యూహములు సాధనమ్ములు
వ్యాహతములు గాఁగ నిద్ది ♦ వ్యాహృతమయ్యెన్. 54
దుఃఖ మడఁగ దౌర్భాగ్యంబు ♦ దోర బెడద
తనము పర్వెత్తఁ బాపంబు ♦ తనువు విడువఁ
గామమోడఁ గ్రోధము చావఁ ♦ గలి నగాహ
మీ మహా ధర్మ మది వచి ♦ యింపఁ బడెను. 55
వేలుపులును దాఁటఁగ లేర ♦ విష్ణు ప్రోవ
మఱొక విధిచేత, మనుజుల ♦ మాటయేల!
అందువలననే సుమ్ము స ♦ ప్తాహ మనెడు
నీ మహా ధర్మ మది వచి ♦ యింపఁ బడెను. 56

అని సూతుండు పలికి మఱియు నిట్లనియె. శౌనకా! యట్లు ఋషి మహాసభలో సనకాదులు సప్తాహ శ్రవణోను ధర్మమును వెల్లడింపఁగనే యొక యద్భుతము జరిగినది. వినుము చెప్పెద. 57

## * భక్తి ఋషి సభలోనికిఁ గొడుకులతో వచ్చుట *

ఉత్సాహము. నందనందనా! ముకుంద! ♦ నాథ! రామ! కృష్ణ! గో
విందా! మాధవా! మురారి! ♦ వేణుగానలోల! రా

కేందువదన! పద్మనాభ! ♦ యీశ! కేశవా! హరీ!
యిందిరా మనోహరా! యదు♦పేంద్ర! కంసమర్దనా!

ఉత్సాహము. సుందరాంగ! హేమ వసన♦శోభితా! చతుర్భుజా!
మందరాగధారి! శౌరి! ♦ మధువిదారి! స్వామి! యం
చుం దృఢోక్తిఁ బాడుచున్ వి♦శుద్ధమైన పెరిమె రూ
పొందినగయువతివచ్చె ♦ యువకపుత్రయుగముతో

వచ్చినయట్టి దేవిఁగని ♦ భాగవతార్థ మిటుల్ స్వరూపమై
వచ్చెను జారువేషమున♦వాహ్వరె! యంచును గొందఱాడఁగా,
వచ్చెనె? యెట్లువచ్చె? నది♦భక్తియె? యీసుకుమారు లోయటం
చచ్చెరువంది కొందఱని♦రా సభ కేఁగె రవం బుదారమై. 60

ఆకరములఁ జిటితాళము
లాకనులం దూర్ధ్వదృష్టి ♦ యా పెదవులపై
శ్రీకాంతుని నామము లెవ
రోకదె యీ తల్లి యచ్చె♦రువుగా వచ్చెన్. 61

ఒకమారక్షులుమూసి నృత్యములు సే♦యున్ దొలసీ మాలికా
ప్రకరంబల్లలనాడ నొక్కపరి యో ♦ పద్మాక్ష! యోదేవ! యో
సకలాత్మా! యనిపాడు నొక్కపరి చే♦ష్టా శూన్యయౌ నెవ్వరీ
యక! కాషాయదుకూలకాంతులఁ దెసల్ ♦ వ్యాపింపవర్తించెడిన్.

ఎవ్వరో యీమె? వీ రెవరో? ♦ యెచ్చటనుస్కనో? యీప్రదేశమిలా
జవ్వని చేరుటేల? ముని♦సంఘము లీమెను గాంచి గౌరవం
బివ్విధ నింతగా సలుపు ♦ టేల? యటంచును బ్రశ్న లుత్తరా
లవ్వన సీమనిండి దెస♦లాని దివిం జని చుక్కలంటెఁబో. 63

అత్తఱి సనకాది నియమి
సత్తములు లక్కలకల ప్ర♦చండ రవము చే
యెత్తి యడంచుచు నభో
భృత్తుల కుద్దులయి పల్కి♦రిటు బిగ్గరగా. 64

సభ్యులార! వినుఁడు ని♦శ్శబ్ద సరణి
ఈమె భక్తి, జ్ఞాన వైరాగ్యు ♦ లీతరుణులు
భాగవత కథార్థం బిట♦పాఁగ వీర
లేగుదెంచి రిచ్చటి కింత♦యేమి చెప్పఁగ! 65

అను మాటల సప్రశ్రయముగ భక్తిదేవి యాలించి మునీంద్రు లొసంగు గౌరవంబు నాదరంబున స్వీకరించి వినమ్రమై సనకాదులతోఁ బల్కెను. 66

* మునులు భక్తిస్థానము నిర్ణయించుట *

ఓ ఋషివరులార! నమ
స్కారము కలివలనఁ జిక్కి ♦ శల్యం బైతిన్
మీ రిపుడు కథారస మిడి
గారవముఁ గంటఁ బుష్టిఁ ♦ గంటిన్మంటిన్ 67

మీ పెంపుడు బిడ్డను గద
తాపస వరులార! యెట్టి ♦ తావున నిఁక నేఁ
గాఁపుర ముందునో? దానిం
బ్రోవరులై చూపరయ్య ♦ పున్నెం బుండున్. 68

అని భక్తిదేవి పలుకఁగ
సనత్కుమారకులు సుప్ర♦సన్నాననముల్

దనరారఁగ నామొఁ గనుం
గొని యనిరి సతమ్ము భక్తకోటికి నెల్లన్. 69

విమలప్రేమ రసం బెదన్నిలుపు దేవి! విష్ణుసారూప్య సౌ
ఖ్యముకల్పించెడితల్లి! సంసృతిమహారోగవ్యాధిఖండించుమా
త! మురారాతికి ముద్దుగూర్చు సతి! యోతద్వైష్ణవ శ్రేణి చి
త్తములం దెల్లపుడు న్వసింపఁగదె భక్త ప్రీతి సంధాయినీ! 70

ఇటులు వసింతు వేని జననీ! కలిదోషము లెన్నియేని మి
క్కుటముగఁబుట్టి లోకమునఁ గ్రుమ్మరుఁగా, కవినీదువంకఁ జూ
చుటకును గావు శక్తములు సుందరి! పొమ్మన భక్తిదాస హృ
త్పుటములఁగూడుచుండెమునిపుంగవసూక్తులెవండుమీఱెడిన్

సకల జగంబులం దెవరి స్వాంతములన్ హరిభక్తి నిల్చు వా
రి కలిమిలేము లేల? యరరే! బహుధన్యులు వారె, యమ్మురాం
తకుఁడు స్వలోక కేళి బహుభా త్యజియించి యనూనభక్తి సూ
త్ర కలితుఁడై వసించెడి నిదద్ధృదయాంబుజ కేసరంబులన్. 72

ప్రవచింపంగల వారమే? రుచిరమై బ్రహ్మాత్మకంబైన భా
గవత ప్రాభవ? మేల పెక్కనుడు? లాగ్రంథంబుఁ జేపట్టి యీ
భువి నెవ్వాఁడువచించు? నెవ్వఁడువినున్? ముఖ్యంబుగా వారు శ్రీ
ధవు సామ్యంబు వహింతురేమిటికిఁకన్ ధర్మంబులన్యంబులున్.

అని కుమారులు సభలో వక్కాణించిరని సూతుండు
మఱియు నిట్లనె. అట్లు వైష్ణవ హృదయములం దలౌకిక భక్తి
ప్రవేశించుట తోడనే. 74

శ్రీలలనాసమా♦శ్లిష్టావక్షునుఁడు
నీల మేఘశ్యామ ♦ నిర్మల తనుఁడు 75
వనమాలికాప్రభా ♦ వ్యాపితోదరుఁడు.
ఘనశంఖ చక్రశార్ఙ్గ గదాది కరుఁడు. 76
సౌందర్య జితకోటి ♦ సోమకార్ముకుఁడు
చందన చర్చితాం♦చత్స్వ రూపకుఁడు. 77
హారి కపోల వి♦హారి కుండలుఁడు
హారకాంచీ మకు♦టాంగ దోజ్జ్వలుఁడు. 78
కౌస్తుభరత్న ప్ర♦కాశ మానుండు
నిస్తుల స్వర్ణ కాం♦తి పరిధానుండు 79
మందహాసానుగా ♦ మలకటాక్షుండు
సుందరాబ్జవిశాల ♦ సురుచిరాక్షుండు. 80
శ్రీవత్స విస్ఫుర ♦ చ్చిహ్నరమ్యుండు
లావణ్య మధుర వి♦లాస గమ్యుండు 81
వైకుంఠ వాసుండు ♦ పద్మనాభుండు
శ్రీకంఠ మిత్రుఁ డా♦శ్రిత వత్సలుండు. 82
సచ్చిదా నందుఁడు ♦ సర్వకారణుఁడు
వచ్చి భక్తుల మనః ♦ పద్మముల్ సొచ్చె. 83

భాగవత కథాశ్రవణార్థము వైకుంఠ వాసులు వైష్ణవులుద్ధవాదులు వచ్చి గూఢరూపులై యుండిరి, వారిది యంతయుం జూచి యానందాతిరేకంబున జయజయ ధ్వానంబులు సేసిరి, అంబరవాసులు చూర్ణప్రసూన వృష్టులు కురిసిరి,

సభాస్తారు లెల్లరు దేహ గేహాదులు మఱచి యుండిరి. అట్టి తన్మయా వస్థను నారదుండు నూచి యిట్లనియె. 84

అరరె మునివర్యులార! స♦ప్తాహ జన్య
మైన యీ యలౌకిక మహి♦మాతి శయము
గాంచినాఁడ నేత్రంబుల ♦ కఱవు దీఱ
మునిఁగినాఁడ మహానంద ♦ వనధి యందు. 85

మూషకశక సమాజ♦మును బశు పక్షుల
సమజమును నకిల్బి♦షమునఁ గ్రాలఁ
గథను మించినది లో♦కంబును లేదు ని
జమ్ము నిజము సంశ♦యమ్ము లేదు. 86

విమల కథా మయ సప్తా
హముచే శుద్ధుండుగాని ♦ యతఁ డెవ్వఁడు? లో
కము మేలుగోరి కారు
ణ్య మానసులు వెలువఱచిరి ♦ నవ్య పథంబుల్. 87

అని నారదుం డనుచుండ నమ్మాట లందుకొని సన
కాదు లిట్లనిరి. 88

బహు దురాచార సక్తులు ♦ పాప మతులు
క్రోధవహ్ని దగ్ధులు కాము♦కులు విమార్గ
గాములుం గుటిలాత్ములుఁ ♦ గలియుగమున
నమలు లగుదురు సప్తాహ ♦ యజ్ఞమునను. 89

బ్రాహ్మణ ధనంబు చేతను ♦ బ్రదుకువారు
మోసగాం డ్రుద్రగపుంచ పా♦పులు పరాంగ

నలఁ జెఱచువారు నిర్దయుల్ ♦ కలియుగమున
నములు లగుదురు సప్తాహ ♦ యజ్ఞమునను. 90

త్రికరణంబులఁ బాపముల్ ♦ దిన దినంబు
సలుపు వారు దురాశయుల్ ♦ శఠులు మలిను
లొరుల ధనమున బ్రదికెడు ♦ నరులు కలిని
నములు లగుదురు సప్తాహ ♦ యజ్ఞమునను. 91

తల్లిదండ్రుల దూషించు ♦ తనయులాన
పోతులాశ్రమ ధర్మవి♦ఘాతుకులును
హింసకులు దాంభికులు సత్య♦హీనులుఁ గలి
నములు లగుదురు సప్తాహ ♦ యజ్ఞమునను. 92

అని సనకాదులు పలికిరని సూతుండు శౌనకాదులతోఁ
జెప్పెను. 93

భుజంగప్రయాతము. యమాద్యష్టయోగాంగ♦కాభ్యాస కేళీ
సమాసక్త సద్గుర్వ♦జ ప్రాంఘ్రి సేవా
క్రమోపాత్త శుద్ధి స్ఫు♦రచ్ఛాత్ర చిత్త
తమోరూఢ బోధ ప్ర♦కార స్వరూపా! 94

—: గద్యము :—

ఇది ఉభయభాషా ప్రవీణ వేదాంతపారీణ మిన్నికంటి
గురునాథశర్మ ప్రణీతంబైన శ్రీ పద్మపురాణోత్తర
ఖండస్థ శ్రీమద్భాగవత మహిమ యందలి
తృతీయాధ్యాయము.

---

శు భ మ స్తు.

అ వి ఘ్న మ స్తు.

# శ్రీమద్భాగవత మహిమ.

## చ తు ర్థా ధ్యా య ము.

శ్రీపద్మాసన సంస్థా!
గోపాలన కేళిలోల! ♦ గురుశివమంత్రా
లాప బలప్రాపిత విజ
యాపార విజయ విలాస! ♦ హరిహరనాథా! 1

అవధరింపు. మవ్వల సూతుండు శౌనకాదులతో నిట్లనె. అట్లు సనకాదులు నారదాదులకుం బరమ పతితులును పావను లగుదురని చెప్పి యిట్లనిరి. ఇచట నొక పురాత నేతిహాసంబు నొడివెదము. తచ్ఛ్రవణ మాత్రంబునం బాపహానియగు. దాని నాలింపుఁడు. 2

### * సనకాదు లాత్మదేవుని కథను జెప్పుట. *

పూర్వము తుంగభద్రకును ♦ బూర్వదిశాతట మందొకం డు గం
ధర్వ పురంబు గ్రాలె నట ♦ ధర్మము దాఁకొడివాఁడు విద్దెలం
గర్వము నొందువాఁడమల ♦ కర్మము సేయనివాఁడు లాఁతి మే
లోర్వనివాఁడు సత్యమున ♦ కొగ్గనివాఁడలరారఁ డొక్కఁడుణ్. 3

వర్ణాశ్రమ ధర్మంబుల
నిర్ణయమును మీఱఁడెవఁడు ♦ నిగమంబులు సం
పూర్ణముగఁ జదివి సకల క
ళార్ణవులై యుంద్రుపాఱు ♦ లాపురిలోనన్. 4

వారిలో నాత్మదేవుఁడన్ ♦ బ్రాహ్మణుండు
సకలవేద విశారదుం ♦ డకుటిలుండు
శ్రౌతమున స్మార్తమునను భా ♦ స్కరుని బోలె
వెలుఁగుచుండును దిగఁబెట్టఁ ♦ గలిమికలదు 5

ఆతని కొక్కభార్యకల ♦ దామెను ధుంధులియందు, రుత్తమ
ఖ్యాతకులంబునం బొడమె ♦ నందము చందముకద్దు గీమునం
జాతురతోఁ బనుల్ సలుపు ♦ సంతతముం గడువాగుచుండుఁదా
నేతఱినొండ్లతోడఁ గల ♦ హించు మఁగ్రౌర్యము సూపుచుండెడిన్. 6

అదియేమాట వచించునా వలుకు నూ ♦ తాశైనఁ జెల్లంగ నా
నెది లోకంబున వార్తపొక్కునది తా ♦ నేమంచు నాలింపనౌ
బదులెవ్వాఁడయినన్ వచించునిక న ♦ వ్వానిన్ సమూలంబుగాఁ
గదలించున్ దరమే వదల్చుకొన నా ♦ గయ్యాళినోటం బడన్. 7

జగజంత యూరిమీఁదం
దెగఁదిరుగున్ వాదులెల్లఁ ♦ దీర్చు నయిన హె
చ్చగు నీల్వ్వనఁ గనుగల్గి మె
లఁగు రేఁగడవం గరమ్ము ♦ ల నెవండంటున్? 8

కట్టుకొన్నయాలు ♦ గావున నది యెట్టి
గట్టివాయియైన ♦ నెట్టులనో

ధరణిసురుఁడు కడఁక ♦ సరిపెట్టుకొని కాఁపు
రమ్ము సేయుచుండె ♦ నెమ్మిమీఱ 9

ధనముల్ ధాన్యములిండ్లువాకిళులు క్షే♦త్రంబుల్ బలీవర్దముల్
ఘనగోవుల్ మహిషీతతుల్ పరిజనుల్ ♦ గ్రాలొన్నెమ్ము లేవెన్నియు
న్నను సంతోషముసేయ వారొఁగదసం♦తానంబు లేకున్ననం
చును నాదంపతు లెంచియుస్సురెడఁదగన్ ♦ శోకించిరో నారదా! 10

మొదట నర్థంబు గలద యూ♦పిదపఁగామ
మబ్బె రెండుండినను సుఖం♦బలరదాయె
నంచునాతఁడు సంతతి ♦ యబ్బుకొఱకుఁ
బిదప ధర్మంబు సేయఁగా ♦ మొదలుపెట్టె. 11

భూములను గోవులను వస్త్ర♦ములను హేమ
ములను రజతంబులను భూసు♦రుల కొసంగెఁ
జదువు సంధ్య లాచారంబు♦సరిగఁజూచి
పాత్రమెఱిఁగి దానము సేయ♦వలయుఁగాదె. 12

అందుఁగూడ నేవారి కె♦య్యది యొసంగ
వలయునో యది చూచి యే♦వాఁడొసంగె
నేవిషయమున కేపద్య♦మీయవలెనొ?
సత్కవీంద్రుఁడు చూచియొ♦సంగునట్లు. 13

వనమును నాటించెఁ బా
విని ద్రవ్వించె నొకచెఱువు♦వేయించెఁ భో
జనములు వెట్టు గుడిన్ని
ల్పెను బూర్తమ్మనను సంతు ♦ లేదాతనికిన్. 14

కొడుకైనఁ గూతురైనం
బొడమకునికి నింటఁగాల ♦ ముంబుచ్చఁగలే
కడరు నడలున నతం డా
క్కడఁ డయడవికి వెడలితిరుగఁ ♦ గడఁగె విమనుఁడై. 15

అంత నడిమింటి పై కర్కుఁ ♦ డరుగు దేర
నచట నెంతవనచ్ఛాయ ♦ మలరుచున్న
నాతనికి దప్పికల్గినీ ♦ రానపుట్టె
నడఁగియుండదు కాలమ ♦ హాత్త్వ మెపుడు. 16

ధరణీదేవుఁడు దూప దీర్చి కొనఁ గాం ♦ తారమ్మునందారు చా
దర మొప్పారఁగ నొక్కచోఁ గని సము ♦ ద్యద్భృంగసంచారముఁ
వరసౌగంధిక కైరవాంబురుహ దీ ♦ వ్యత్సౌరభోద్గారముఁ
బురుపీయూషరసస్ఫురన్మధురవాః ♦ పూరమ్ముఁ గాసారముఁ. 17

పాఱుండు కూరిమిమీఱ నక్కాసారమ్ము సేరి స్నాన సంధ్యాదు లాచరించికొని దగదీఱ నీరపాన మ్మొనర్చి తీరమ్ము నంగల భూరుహమ్ము చేరువఁ గూరుచుండం గొండొక కాలంబు గడచె నంత. 18

కడుదీర్ఘంపు జటాకలాపము శిరో ♦ గ్రంబందు నెట్టెంబు కై
వడి దీపింపఁగఁ జుట్టి సాంద్రకశఁ బ్రా ♦ వారంబుగాఁ దాల్చియె
క్కుడు బ్రహ్మంబగు తేజమాస్యమువయిం ♦ గుంపించి శాంతంపుసొం
పడరన్ నేత్రములందొకంతమునిడా ♦ యన్వచ్చెఁగాసారముఁ. 19

వచ్చి జలమ్ములందిగి పాదాదిప్రక్షాళన మాచరించి కొని యించుక జలమ్ము ద్రావి తీరమ్ముచేర నాత్మదేవుండు

వినమ్రుండై డాసి నమస్కరించి దీనాననుండై నిలువంబడ
యతివరుం డిట్లనియె. 20

## * మౌని దేవాత్మదేవ సంవాదము *

ఏటికి నిట్టూర్పు విడుతు?
వేటికిఁగన్నుగవనీర • మేతెంచెడి? ని
చ్చోటనొకండవెయున్నా
వేటికి వచియింపు తండ్రి? • యే మాపదయో? 21

అన నాత్మదేవుం డంజలిపట్టి యిట్లనియె. 22

స్వామి! మహానుభావ! ముని•సత్తమ! పూర్వకృతాఘమీగతిం
బ్రాఁకెను. నాపితాళ్ళిపృుల•త్రావెదరయ్యకవోష్ణ తోయముల్
ప్రేమముతోడఁగైకొనరు•వేల్పులుఁబాలులు నేనొసంగుచో
నేమన? సంతులేదనుమి•యీకలుషాత్మునకున్ దయానిధీ! 23

గుణినిలువఁబడనిచిత్తము
తతికొదవనివిత్తము విబు•ధమనోమణులం
గరఁగింపని పొత్తము సుతు
మురిపెము గనని నరు వృత్త•ము వృథావృథగా. 24

ప్రజలులేని యర్థంబు వ్య•ర్థంబుగాదె
కొడుకులేకున్నకులము వ్యా•కులముగాదె
పట్టి తిరుగని భువనము•వనముగాదె
మొదలు చెడ్డబేర మ•పుత్త్రి బ్రదుకుఁ దెరువు. 25

హా! నేఁ బోషించు కపిల
ధేనువు కట్టద యదెన్ని•దినములుచన్నన్

నే నాటిన వృక్ష మకట
ప్రమానయ్యెఫలింపదేమి ♦ మాటాడనిఁకన్? 26

నాయన! ఫలమేదయిన
న్నాయింటికివచ్చెనే న♦నతి కాలములో
నే యక్కట! చెడిపోవను
జేయఁగలదేమియింక ♦ జీవమ్ములతో. 27

నిర్భాగ్యుఁడనగు నాప్రా
దుర్భావముచేఁ బితాళ్ళు♦తోషముగన రే
స్వర్భోగములంబొందను
దుర్భరజీవితము మోయు♦దునటే యింకన్. 28

గొడ్డుఁబోతువాని♦కూడు కూడదటంచు
దొడ్డవారలిల్లు ♦ దొలఁగిపోవ
గడ్డిపోచకన్నఁ ♦ గనగష్టమైననా
యెడ్డ మోఁచు నెట్టు♦లీయవమతి? 29

బ్రదుకుపైనిరోసి ♦ ప్రాణంబులఁ ద్యజింప
వచ్చినాఁడనిటకు ♦ స్వామి! యంచుఁ
బెద్దపెట్టుగాఁగఁ♦బెడమోముతో నేడ్చ
విన్నవారి గుండె♦బ్రీలిపోవ. 30

యతివరుకోమలంబయిన ♦ స్వాంతము నీరయిపోయి దీనికిం
గత మదియే మొకో తెలియఁ♦గావలెనంచుఁ దలంచివానిఫా
లతలవిధాతృనక్షరము ♦ లంగని సర్వమెఱింగి నేటిక
ద్భుతపడయోగశక్తిగల ♦ ప్రోడలకొందు దురావమున్నదే! 31

అంతన్మౌనివరుండు గేస్తుఁ గనియ♦య్యా! యేల సంసారసం
భ్రాంతిం జిక్కి దురంతచింతలఁ గృశిం♦పన్? జ్ఞానముం బూనరా
సంతానంబది చట్టుగాను కనవో♦శాస్త్రిలు గీస్త్రిలు నీ
స్వాంతంబందు బలిష్ఠకర్మము బడి♦వ్వర్తించు రాభూతముల్. 32

అరసినాఁడనీదు ♦ ప్రారబ్ధ మేదు జ
న్మములనుండి నీకు ♦ నాస్తినాస్తి
పుత్రబలము వగలఁ♦బొగలకు నాలవ
యాశ్రమంబు పూను♦పోయి గాను. 33

కొడుకు కొడుకటంచుఁ ♦ గొట్టుకొందువు తెగ
సంతుకలుగఁగానె ♦ సంబరంబె?
యరరె! సగరునకును ♦ నఱువదివేవురు
ప్రాముకొన్న దేమి ♦ వాఁడు చెపుమ. 34

కొడుకుఁ గుజ్జనోడిని ♦ దొడుకు నాసంజేసి
నడుఁకు సారము వొడమ ♦ మిడుకు దార
దుడుకు సూపక ముదిఁ ♦ బుడుకునే కడినీకు ?
గొడుకు కడఁక నుడుగు ♦ ముడుకు వగను. 35

ఓరీ! నామాట వినుము
కూరకు దుఃఖమ్ము విడువు♦ఘోరతరము సం
సారము పన్న్యాసమ్మె య
పార సుఖము నిచ్చు నెన్ని ♦ భంగులఁ గన్నన్. 36

అనిన నాత్మ దేవుఁడిట్లనియె. 37

గేస్తు "అపుత్రస్య గతి
ర్నాస్తి" యనెడి నుడుగు ఖంగు♦ముని ప్రమోఁగఁగవి

త్రస్తాత్ములు గా రే? విబు
ధ స్తవనీయ చరితులరు ♦ తా మెఱుఁగర టే. 38

అనిన మునివరుండు పకపక నగి యిట్లనియె. "అవశ్య మనుభోక్తవ్యమ్ కృతంకర్మ శుభాశుభమ్" అనెడి పెద్దల సుద్ది నాలింపవో? 39

ఎవఁడేది చేసికొనునో?
యవశ్యమది యనుభవింప ♦ నగుఁ దప్పదు కా
ల విపక్వమైనపుడు చూ
డవో? దూర్వామూలముం బొ ♦ టమరించుటలన్. 40

కలిఁబుత్త్రిలు కలుగుటకుం
గలుగక యుండుటకు నెవరి ♦ కరములలోనం
గలదు? ఋణబంధముకొలఁదిఁ
బొలుచును బశువులు గృహములు ♦ పుత్త్రిలు, పత్నుల్. 41

సుగతులు సత్త్రియల్ సలుపు ♦ చో నగువానిని బుత్త్రిలాచరిం
పఁగవలెనంచు నేల తలఁ ♦ పన్ వలె? నీకయి నీవు చేసికోఁ
దగదె? పరంబునన్ సుఖవి ♦ తానము కల్గుటకా? సుతార్థివై
పొగులుట? లేక యైహికము ♦ పొల్చుటకా? ధరణీసురాగ్రణీ! 42

ఉభయలోక సౌఖ్యములు క్రి ♦ యోద్భవమ్ము
లగుట నవియనిత్యమ్ముల ♦ టంచు వాని
కన్న మిన్నయౌ ముక్తి సౌఖ్యమ్ముకొఱకు
జ్ఞానులొనరింత్రు కర్మ స ♦ న్యాసమనఘ! 43

తనయులటయ్య! సద్గతులు ♦ దార్తురు? పుత్త్రిలు లేక చన్న శాం
తనవుఁడు దుర్గతిం బడియె ♦ నా? యవివాహితుఁడైన వ్యాసనం

దనుఁడును దుర్గతింబడిరో॥నా? హనుమంతుఁడో? నారదుండో?
రో!యనఘ!నివృత్తిమార్గపరు॥లంద రపుత్రకులయ్యుదుర్గతిన్,

అనిన నాత్మదేవుం డిట్లనియె. 45

శూరులుపుత్రకుల్ గలుగఁ॥జూ సురలోకముఁబొందెఁ బాండుభూ
దారుఁడు మన్మలుండినఁగ॥దా దివికేగె యయాతియున్ జర
త్కారువు సంతతిం బడయఁ॥గాఁ బితరుల్ నియమించి రేల? యో
సూరివరేణ్య! నన్ను దయఁ॥జూడవె! నీ కెదురాడు వాఁడనే? 46

అనిన నమ్మౌని యిట్లనియె. 47

అవునయ్యా! యది కర్మమార్గము తదీ॥యాధ్వమ్మునంబోవు మా
నవు లా నాకసుఖాలు పొందెదరు పు॥ణ్యక్షీణ మైనంతనే
భువిపైఁగూలుదు రేను జ్ఞానసరణిం ॥ బొమ్మంటి నట్లైనఁ బొం
దవు జన్మమ్ములు మృత్యువుల్ సతము నా॥నందమ్మువెల్గొందెదిన్.

క్షితిదేవసత్తమ! స్వయం
కృతములు పరకృతములు నన॥సిరుదెఱఁగులు స
త్కృతు, లవి స్వర్గమునఁ సుఖ
ప్రతానముం గూర్చుఁబ్రాణి॥వర్గంబునకున్. 49

నీ కర్మంబులు నీవచేసికొనుమం॥టిన్ బుత్త్రుఁడో పౌత్త్రుఁడో
లే కింకెవ్వఁడొ చేసి నీకొసఁగుటల్ ॥ శ్రేష్ఠంబు గాదంటి, ని
న్నో! కర్మాధ్వము రాకపోకలను గా॥సింబెట్టు జ్ఞానాధ్వముం
గైకొమ్మంటి నటైనఁ గల్గుఁ జిరసౌ॥ఖ్యంబంటి, జంకేటికిన్. 50

అనిన నాత్మదేవుండిట్లనె. 51

స్వామి! క్షమింపుఁ డీబడుగుఁ ♦ బాపఁడు మీనుడిపోఁడిమిం గనం
జేమియు నైనఁ బుత్త్రుఁగన ♦ నెంచెడి మోఱకు పట్టుపట్టి యో
గామిత శక్తియుక్తులకు ♦ నందనిదుండడు మీరు నన్నుఁ గం
ద్రేముడిఁ జూడరే నిట హ♦రీ యని ముక్కునుమూసికొందుఁ గా.

కన్నీరు బుగ్గలఁ ♦ గారుచున్నప్పుడే
బోసినోరు దెఱచి ♦ మురిసి నవ్వ
చందమామా! రావె ♦ జాబిల్లి రావే య
నుచు మొదల్పెట్టఁగా ♦ నోరు విప్పు
కమ్మఁగా నుంచును ♦ బొమ్మ ముద్దుమిది యా
నంగ గుటుక్కున ♦ మ్రింగు దాని
నరుగు చున్నారు నా♦యనగా రసంగానె
యెత్తుకొమ్మని చేతు♦లెత్తి యడ్డు
అమ్మ తాయెము కొనిపెట్టు♦మంను నేడ్చుఁ
బాప! రా! యఁ బర్వెత్తి ♦ పైనిఁ బడును
బొమ్మ! లేవి యనుచుఁ బొత్త♦ములను లాగుఁ
గొడుకు సుగ మిట్టిదసి యేసు♦నుడువఁగలరు? 53

అపుడపు డాత్మలోఁ బొడము♦నాశయముం బ్రకటింపలేక బ్రా
తిపదిక మెట్టిటో యనుచుఁ ♦ దేవకుఁదల్లికి నడ్డువోవఁ గో
పపడఁగ నాపె, నన్నుఁ గని♦బావురు మంచును నేడ్చుచస్మదం
కపుఁ దొడవై వెలుంగు సుతు♦కౌఁగిలి సౌఖ్యము నెన్న శక్యమే?

కొడుకులుఁ గూఁతులు గోడం
డ్రోడికపు మనుమలును నిండి♦యుండంగా న

వ్వండు కళకళలాడుచుఁ దం
గెడుపూచిన యట్లుగాదె ♦ గీముపెలుంగున్. 55

అనిన యతివరుం డిట్లనియె. 56

పిల్లల వలన సుఖమ్ములు
గొల్లాడుదె? గొంతులోన ♦ గుఱగుఱలాడన్
దల్లడిలవె? కాల్గాలిన
పిల్లివిగావె? కడిగొందు♦వే? నిదురింతే? 57

మున్ను విరించి దుఃఖమును ♦ బుట్టఁగఁ జేయఁగ నాపె వచ్చి క్రా
ల్గన్నుల నశ్రువుల్ గురియఁ♦గా జనకా! నను జేరనిత్తురే
యి న్నరులన్న ధాత యపు♦డింద్రియ సౌఖ్యము మాటువెట్టి నీ
కు న్నెలవేర్పఱింతు నని♦త్రోణి సుఖమ్మన దుఃఖముండెరా. 58

మొదట నొకండవే యపుడు♦పుట్టెను దుఃఖముగూడ నొక్కఁడే
వదవడి తెచ్చికొంటి వొక♦భార్యను గావున రెండు దుఃఖముల్
గదిరెను నేఁడు పుత్త్రకొఱ♦కై తపియించెదు మూఁడు దుఃఖముల్
గుదిగొనవయ్య! యొందుకొఱ♦కోయిటుదుఃఖము లీవు గోరుటల్.

జ్ఞాన సుతుం గోరుమురా
వానివలన రాక పోక♦భాసిల్లని ని
త్యానంద సౌఖ్య మొందెదు
పూనిక యేమిటికిఁ జర్మ ♦ పుత్త్రులకొఱకై. 60

అని మౌనీంద్రుండు నాలవ యాశ్రమము స్వీకరింపుమన
భూసురుండిట్లనియె. 61

స్వామి! యే ద్వితీయాశ్రమ ♦ ఫలమె పొందఁ
జాల కా తురీయాశ్రమ ♦ సౌఖ్య మెట్లు

లెనయ నోప్పదు? నుత్త్రి కే ♦ యొక్క లేని
యామె స్వర్గంబునకు నెక్కు♦ నే మహాత్మ! 62

నిరుపమ యోగశక్తిసిద్ధి! ♦ సీటను ముంచెదో? పాలముంచెదో
భరమిఁక మీరె మీ యదు గు♦పట్టితిమీదయయుంచుఁ బల్లు భూ
సురుని మహాగ్రహంబుఁ కుఁ♦ జోద్యము చెంది యెడంద నయ్యతీ
శ్వరుఁ డిటులాడె నెంతహిత♦ వాదివయా ధరణీసురాగ్రణీ! 63

మున్ను విధిలేఖ మార్జనం♦బునను జిత్ర
కేతుఁ డిడుములు గుడిచిన♦రీతి నీవు
కొడుకు వలన సుఖంబులు ♦ వడయ లేవ
దైవహతుఁడు సౌఖ్యంబు లొం♦దంగలాఁడె! 64

ఎన్ని వచించిన స్వినవ♦ యేమి యొనర్తును భూమిదేవ! కా
నున్నది కాకమాన దిదె♦ నిక్కఫలంబు గ్రహింపు దీనినిం
దిన్న నెలంతకుం బొడము ♦ సిర్మల చిత్తుఁడు సూనుఁ డింటికిం
గ్రన్ననఁబోయి నీ నెలఁత♦కై నిడుమయ్య! యొకండుచెప్పెదన్.

వనిత దీనిభుజింప సం♦వత్సరాంత
మేకభుక్తంబె భోజన♦మెల్లప్పుడును
సత్య మాడంగవలయు శౌ♦చంబు దయయు
దాన ధర్మము లుంట యు♦త్తమము సూవె. 66

అని యాఫలం బొసంగ నయ్యాత్మ దేవుండు మహా
ప్రసాదంబని మోదంబునం గ్రహించి ప్రణామంబు లాచరించి
దరహాసరోచిరుదంచిత గండమండలుండును సమధి కోల్లాస
భాసుర మానసుండునై సరభసగమనంబున నిజమందిరాంగణ

ప్రదేశంబునఁకరిగి దారం జీరి సర్వంబు నుడివి ఫలంబునొసంగి నియమంబులం జెప్పి భుజింపుమని పలికి తాను దొందరపని కలిగి యొందే నరిగెను. 67

## * ధుంధులీ విచారము *

కొడుకులు లేకున్నప్పుడు
కొడుకులు కొడుకులని కొట్టు♦కొనియెం గానీ
కొడుకు పొడము వెరవుదొరక
నెడఁద వెనుకదీసెఁ బడఁతి♦కేమందువిధీ. 68

పిదప ధుంధులి మది చెయి♦వెట్టికలఁచి
నట్టులయ్యె నానియమాలు ♦ నావ్రతాలు
నా యనూనగర్భిణి బాధ♦లా ప్రసూతి
కష్టములు నన్ని కన్నులఁ♦గట్టె నిలువ. 69

సఖి యెదుటఁ గన్నుఁగవ. నీరు♦జాలువాఱ
నిట్టులనె ధుంధులీకాంత♦యేమె వింటి
కాదె? యిప్పుడు నానెత్తి♦మీఁద నొక్క
కొండ విఱిగి పడ్డది చెప్పి♦కొన్న సిగ్గు. 70

మునియటే వాఁడు నా ప్రాణ♦ములకె వచ్చి
పడెను దానొక పండిచ్చి♦పాడు నిష్ఠ
కలిగి తినుమనె నది తిన్నఁ♦గలుగు నంట
కొడుకొకండు వంశోద్ధార♦కుండు వింటె! 71

ఒంటిపూట తిండి ♦ యొకనాఁడ? రెన్నాళ్ళ?
వత్సరంబు గడవ♦వలయు నంట

యింటి యెల్లపనులు ♦ నేఁ యేస్వఁగ వలె
నెట్టులమ్మ దీని ♦ నే భరింతు? 72

వారి కేమమ్మ మగవారు ♦ దూరముగను
నిలిచి బడబడ వాగుదు ♦ రలవి యెఱుఁగ
రకట గర్భంబు దాల్చుట ♦ యన్న మాట
లో? దిగినవారి కేగదా ♦ లోతుఁ దెలియు. 73

అన్న మంగిటికిఁ బో ♦ దదియిది తినఁగోర్కి
పుట్టు నా తిన్నది ♦ గిట్ట కేగు
నోట నీరూరు చుం ♦ డును నాల్క రుచి చచ్చు
మట్టి పెళ్ళల మీఁద ♦ మనసు పోవు
బహు వికారము గల్గుఁ ♦ బసరు వెళ్ళుచు నుండు
నిదుర పట్టదు గుండె ♦ లదరు చుండు
చెక్కిళ్ళు వెల బాఱు ♦ బక్క చిక్కు శరీర
మలసటగా నుండు ♦ నలుకు పాదము

ఎబ్బెతికముగ నీ పొట్ట ♦ యింతపెరుగు
నలవగును రెండుముద్దల ♦ కధికము దిన
వడిగ నడువ లేమక్కఱ ♦ వడినఁ గూడఁ
బోదు కడుపున కెందుకో ♦ ప్రాఁకులాట? 74

కడుపు కడువన్నఁ బిడుకల ♦ గుడిసె కాదు
పిండ మడ్డముదిరిగిన ♦ నిందు ప్రాణ
మునకె మోసము వచ్చువి ♦ భుండు వచ్చి
నన్నుఁ జంపినన్ సరియె తి ♦ నన్ ఫలంబు. 75

సుదతిరో! నేను గూర్చున్న ♦ చోట నుండి
లేవ లేనప్పుడు ననాంద ♦ లేకి ముంత
యింటఁ గలయున్ని 'కాజేయు' ♦ నెవరె యడ్డ?
మేను దానివెంటఁ దిరుగ ♦ లేనుగాదె! 76

గొడ్డురాలి కేమి తెలియు ♦ బిడ్డబాధ
యంద్రు గాని యిరుగుపొరు ♦ గమ్మలక్క
లప్పు పడు బాధసూడన ♦ టమ్మ యయ్యొ
వలదె పగవారికైన నా ♦ ప్రసవ బాధ. 77

ఎట్టులనో జనించునని ♦ యెంచిన నావల బిడ్డ పోషణం
బిట్టటుగాదు దేనికిని ♦ నేడ్చును జెప్పఁగ నోరులేక య
ప్పట్టున వాని భావమును ♦ బట్టి మెలంగఁగ నిన్నెవం డొగిం
బుట్టఁగఁ జేసె నా నలువ ♦ పోఁడిమితో దిగిరావలెం జుమీ. 78

పెత్తనంబున కేగ ♦ వీలుండదెప్పుడు
గ్రుక్కలు పట్టుచుఁ ♦ గుందునొక్కొ
కడు వెలయైన కో ♦ కలఁగట్టరాదెప్పు
డొడి మలమూత్రముల్ ♦ విడుచునొక్కొ
ఇష్టమైన పదార్థ ♦ మెలమి భుజింపరా
దెపు డజీర్ణం బావ ♦ హిల్లు నొక్కొ
హాయి గాలి విసరు ♦ నారుబయుటఁ బండ
రాదెప్పు డల పులుఁ ♦ గేఁదు నొక్కొ

వాని యేడుపుడిపి ♦ వానికిఁ బాలిచ్చి
వాని ప్రక్కవేసి ♦ వానిఁ బండఁ

బెట్టి వానిఁజిచ్చి♦కొట్టి వాని సిదుర
ప్రచ్చి తల్లియవలఁ♦బోవలయును. 79

కడుపునిండఁ దిండి ♦ కంటినిండ నిదుర
దక్కఁబోదు బిడ్డ ♦ తల్లి కెప్డు
ముండమైన గొడ్డుఁ♦బోత్రైన నిట్టి క
ష్టాలు లేక యుండ్రు ♦ సౌఖ్యముగను. 80

ఇయ్యెక్కల్లె యిట్లుండ వీనిం దలదన్నినవి మఱికొన్ని కలవు. 81

అందటొక్కయెత్తు ♦ నల యగస్త్యుఁడొకెత్త
టన్న యట్లు శౌచ♦మంట సత్య
మంట వానిపాడె ♦ యవియెట్టులే దొంగ
పోటుకన్న లింగ♦పోటు మిన్న. 82

కాన ఫలంబును నేఁడిన
లే నాకష్టమ్ములఁ బడ♦లేనంచని యా
పై నాథుఁడు వచ్చి యడుగఁ
గా నది తింటి న్నిజంబు♦గాఁదింటి ననెన్. 83

## * సింధులి ధుంధులి కుపాయము చెప్పుట *

వాడును సంతసిల్లె నొక♦బాలుఁడు పుట్టునటంచు నంత నా
చేడియ చెల్లెలొక్కతుక ♦ సింధులి బిడ్డల తల్లి యక్కనుం
జూడఁగరా విభుండు యతిఁ♦జూచుట దొట్టి వచించి సర్వమే
నోడితిఁ బందుమెక్క నెటు♦లొక్కొయిఁకంజరుగు న్వచింపవే. 84

చూలాలు బాధలం బడఁ
జాలక దాచితిని దినక ♦ సత్ఫల మిఁక నే
లీల ? నుపాయము చెప్పవె
యాలము చేసితినో మీఁద ♦ నాఱడి పడుదున్. 85

అని యప్ప యేడ్వ సింధులి
యనె దీనికి నింత భయమె? ♦ యక్కా! యుపాయం
బును విను చెప్పెద నెపఁడే
వనితల గుట్టును గ్రహించు ♦ వాఁడు ధరిత్రిన్. 86

అని యుంచుకతడవు యోజించి సింధులి యిట్లనియె. 87

నాకు గంపెఁడు బిడ్డలు ♦ న్నారు మరల
నెలమసలె నిప్పుడే కానఁ ♦ గలుగఁ బోవు
పాప నీ కొసంగెద నంత ♦ వఱకు సుఖము
గా మెలంగవే యింట స ♦ గర్భవోలె. 88

ఊరక యప్ప! నీవు దిగు ♦ లొందకు మాయము మాకుఁదగ్గ సం
సారము పెద్దదామె వ్యయ ♦ మా! పెరిగెం దలమించి. కాన మా
వారికి నచ్చఁ జెప్పఁగలఁ ♦ బైకము మాత్రము నీవొసంగుమా
దారికి వచ్చి గూఢముగఁ ♦ దా సిసువుం గొనివచ్చి నీకిడున్. 89

సందు గొట్టె బిడ్డకటంచు ♦ జనులు పలుక
మెలఁగుదుము బావగారు న ♦ మ్మెదరు నేను
వచ్చి బిడ్డను బోషింతుఁ ♦ బతికిఁ జెప్పి
పిలువనంపు కష్టము లేని ♦ ఫలము దక్కు. 90

నిర్భయముగ నీవీలో
గర్భిణివలె సంచరింపఁ ♦ గదె యక్కా! నా

యర్భకుఁడు వచ్చినప్పుడా
విర్భావపు నటన సలుప ♦ వే పతినమ్మన్. 91
అప్పా! యతి గొప్పతనం
బిప్పుడు కనుగొంద మావు ♦ కిదు మా ఫలమే
చొప్పున జరుగునో యనఁగా
నప్పుడఁతి యొనర్చెఁ జెప్పి ♦ నట్లు సకలమున్. 92
అంతట సింధులి యాత్మ సి
శాంతంబున కరిగెఁ బాదు ♦ నావు భుజించెన్
కాంతామణి ధుంధులి వృ
త్తాంతం బామీఁద వినుఁడ ♦ యా! వింతయగున్. 93

* ధుంధులీ చర్య *

పతిపీనులం బడు ♦ గతిఁ బెద్దయులివృత్తో
నుదయ కాలంబున ♦ నోకిలించు
కడుపు నిండఁగఁ దిని ♦ కాంతుఁడు గనఁదెలెన్
వివిధ పదార్థముల్ ♦ విడిచి లేచు
అది తెమ్ము యిది తెమ్ము ♦ యని కొండమీఁది కోఁ
తిని దెమ్మనుచు విభుం ♦ ద్రిక్కు వెట్టు
ఒక చీర చుట్టఁబో ♦ ట్టకుఁ జుట్టి యట్టి చీ
రని కట్టుకొనును భ ♦ ర్తగని యుబ్బ
అసురుసురుమను లేవ లే ♦ నను బెండ
పొడమదెనఁ దిరిగెడి నను ♦ గడగఁ జేరి
సుద్ది ముట్టను నెప్పుడీ ♦ శుండు కరుణ
బయటఁ బడవేయునోయను ♦ బద్దులాఁడి. 94

హంసీయానకుఁ బుత్రవ
తంసుఁడు పుట్టవలయునని ♦ ధరణీసురుఁడా
శంసించి మూఁడవ నెలం
బుంసవనాఖ్యక కర్మ♦ముం జేయించెన్. 95
అంతట బంచమ మాసం
బంతంబై పోవ గర్భ♦మభివృద్ధిగనం
గాంతుఁడు తనకాంతకు సీ
మంతము జరిపించె నుచిత♦మంత్ర క్రియలన్. 96

* ధుంధుకారి జననము *

పిమ్మట నచ్చట సింధులి
తొమ్మిది మాసములపైసి ♦ దొమ్మిది దినముల్
గ్రుమ్మర శశిసూర్యసమీ
పమ్మన నుండఁ బ్రసవించె ♦ బాలుఁడు గలిగెన్. 97
తెలవాఱకమును పే ధుం
ధులికిం గబురంపె మూట ♦ దూఁకెం దనచె
ల్లెలి, కాఱవరేయి విభుని
వలన రహస్యముగఁ బిల్ల♦వానిం బంపెన్. 98
మఱఁది సినువుఁజేర్ప ♦ మంత్రసానియు వచ్చె
జరుగ వలసి నన్ని ♦ జరిగి పోయె
నాలు కనినదనుచు ♦ నాత్మదేవుం డెంచె
ధనము సేయు నెంత♦వనిని గూడ. 99
బాలుఁడు పుట్టెనన్న శుభ♦వార్తను బ్రాహ్మణుఁ డాలకించియు
ద్వేల ముదంబునొంది సర♦విం దెలిసీటను దానమాడి వి

ప్రాళికి గో హిరణ్య రజ♦తాదుల దానములిచ్చె ప్రేమగ ది
క్పాళియు బూరటిల్ల జయ♦వాద్య నినాదము లింటియుంగిటన్.
జాతకర్మ కలాపము ♦ సవిధిజరిగె
నేన నాకుమారునకుఁ బే♦రిడుదు మీరు
మానుఁడని ధుంధుకారి నా♦మమ్ము పెట్టె
బిడ్డ తల్లి మాటను గార♦వించు భర్త. 101
సాంతి చూర్ణంబుతోఁ ♦ జొన్పనో చొన్పదో
దూది మాత్రము చెవి ♦ దూరియుండు
మోడికారమ్మును ♦ సుట్టునో సుట్టదో
విడెము మాత్రము నోట ♦ నడరుచుండు
పొట్ట పెరుగుమాట ♦ పుట్టునో పుట్టదో
నడికట్టుమాత్ర మం♦దముగ నుండు
తడి దాక శైత్యమ్ము ♦ పొడమునో పొడమదో
హంజఁబొదువు మాత్ర ♦ మంటియుండు
వచ్చిమాడగునో కాదో ♦ వలువమేలి
ముసుఁగుతో సంచరించు నిం♦పెసఁగ నడలఁ
బథ్యముండునో లేదో మై♦జలిసియుండు
వింత ధుంధులి వచ్చి బా♦లెంతరాలు. 102

* ధుంధులి తన చెల్లెలిం బిలిపింపుమని భర్తతోఁ జెప్పుట *

ఒక్కపుత్రుఁడె మొ నాథుఁగని ♦ యూరక పిల్లలు పిల్లలంచుఁ గ్రై
పెక్కి తపించినాఁడ వది♦యెంతటికష్టమొ చూడవైతి నేఁ
డొక్కనిసుంగు గల్గ నెటు♦లోముటయో యని చింతపుట్టెనా
కక్కట! నీకుఁ బట్టదిసు♦మంతయు నేది, యిఁకేమి చేయుదున్.

వీని కడుపుడక తడసితి
నేని క్షణము పాలొసంగ ♦ నిల్లెగిరి చనం
గా నేడ్చు నేనుబట్టఁగ
లేనీగయ్యాళిగంప ♦ లేశంబైనన్. 104

నాకా పాలు పడఁగ లే
దీకొడుకా పోరువెట్టు ♦ నేడ్పేడ్పునకే
కోక స్తనిరమ్మంచున్
మోకటిలుదు నా నుదుటనె ♦ ప్రొద్దుపొడిచనే? 105

అప్పటి కెవ్వరేదనిన ♦ నయ్యది చేసితిఁ దమ్మికాడలం
దప్పక తింటి క్షీరములు ♦ తామరగింజలు నూజిత్రాగితిన్
బొప్పయ కాయల న్విసువు♦పుట్టక మెక్కితి నిట్టులెన్నియో
తిప్పలు వడ్డఁగూడ నొక♦తేపకు గ్రుక్కెడు లేవ స్తన్యముల్. 106

ఎల్లపుడన్యకామినుల♦నే బతిమాలుచు బిడ్డఁ బెంపలే
మల్లరి పాలుగాఁగలము ♦ హాయి తెలంగొకఁడిప్డుగంటి నా
చెల్లెలి బిడ్డలేఁ డదిప♦సించినచో మనయింట క్షీరముల్
కొల్లలు కొల్లలీనిసువుఁ♦గూరిమి పోషణచేయు చుండెడిన్. 107

వ్యయమంచుఁ జూడకుమ య
న్వయవృద్ధి పొసంగునట్లు ♦ వ్యయమనుకొన ని
శ్చయముగ జేపీధన సం
చయ మెవ్వరిదయ్యెడిదొ వి♦చారించితివే. 108

నేను వడ లేను బాలుని
తోనీవేమైనఁ జేయు ♦ దువుగాకింకన్

వానివని నాడిగాదు సు
మా నావుడు విభుఁడు నవ్వి ♦ మానిని కనియెన్. 109

ఎందుల కంత వేసటవ ♦ హించెద, వీవు వచించుదానిఁ గా
దందునె? యంటిస్త్రైయెపు ♦ డైనను జెల్లెలిఁ బిల్వఁ బంచెదన్
నందను నేడిపింపకుము ♦ నాతిరో! యాగ్రహమత్తమీఁద రా
దందడి దుత్తమీఁద నటె ♦ దానిని జూపుట పిచ్చిదానవా! 110

అని యటనుండి తొలంగి చని మాపటివేళకే సింధు
లిం బిలిపించి యింటనుంచుకొని బాలుం బోషింపించుచుండెను.
అంత. 111

## ✻ గోకర్ణజననము ✻

మూఁడు నెలల్ గతింపఁగనె ♦ పుత్త్రుని బెట్టెను గోవు వందునా
నాఁడు భుజించియుంట ముని ♦ నాథుని వాక్య మసత్యమా నె? యు
వ్వాఁ డతిసుందరాంగుఁడు సు ♦ వర్ణసమాభుఁ డనేకు లాతనిం
జూడఁగ మూగి రెంతయును ♦ జోద్యముగా ధరయీనినట్టులన్.
ఆవఁట! పుత్త్రిఁ గన్నదఁట ♦ యాతఁడు మన్మథుఁడంట! వింటిరే!
భూవిబుధుండు వానిఁగని ♦ పొంగుటతో సరిపోయెఁ గాని యే
త్రై వడి వీఁడు పుట్టెనని ♦ గాఢ విచార మొనర్పఁడాయెఁబో
యీవిధ మెల్లఁ జెల్లెలును ♦ జ్యేష్ఠయుఁ జూచి కలంగి రాత్మలన్.
అయ్యవసరంబున నాత్మదేవుండు. 114

ఆవు కొడుకనుకొనక దే ♦ వాంశజుఁ డని
తలఁచి సుతునకుం బోలె జా ♦ తమ్ము సలిపి
వాని చెవి గోవుకర్ణంబు ♦ వలెఁ దనర్ప
నెమ్మి గోకర్ణుఁ డనియె నా ♦ మమ్ము వెట్టె. 115

ఆవు కడుపులోన ♦ నర్భకుం డెట్లుండు?
నున్న వాఁడు బ్రదికి ♦ యుంట యెట్లు?
లఖిల మీశ్వరుని మ♦హత్త్వ మంచెంచిరి
ఋషి ఫలమ్ము మర్మ♦మెవరి కెఱుక? 116

బాలకులు శుక్లపక్షాబ్జ♦వైరి కళల
రీతి దినదిన క్రమమున ♦ వృద్ధిఁ గనిరి
శైశవంబు పౌగండంబు♦ జారె యావ
నాంగణమునఁ గాలూదిరి ♦ హర్షమునను. 117

అక్షరాభ్యాస మొనరించె ♦ నర్హకాల
మందుఁ జౌలోపనయనముల్ ♦ పొందు పఱిచెఁ
దండ్రి కరణీయముల్ దీఱెఁ ♦ దనయుల కవి
గిట్టుటలో? వారి చేతలఁ ♦ బట్టియుండు. 118

సాంగముగ నాల్గు వేదము ♦ లభ్యసించె
నాఱు శాస్త్రంబులఁ బఠించె ♦ సాంతముగను
చదువు నాచరణమ్ము నె♦సంగుచుండ
నవ్య యశమందె గోకర్ణ ♦ నాముకుండు. 119

* ధుంధుకారి దుశ్చేష్టలు *

బడికిం బంపినఁ బోఁడు పోయిన నటం ♦ బాఠంబులన్ శ్రద్ధచూ
పఁడటుల్ చూపిన వల్లెవేయఁడెటులో ♦ వల్లించినన్ బుద్ధిని
ల్పఁ డొగిన్నిల్పినఁ దత్ఫలంబుఁ గనఁడె♦వ్వట్లన్ దురధ్వంబునం
దడుగుల్ వెట్టునుధుంధుకారిపితచిం♦తాక్రాంతుఁడైయుండఁగన్.
శ్రమమేలా? చదువేల? యేల గురుశి♦క్షుం గుంద? రండాడుకొం
దము పొత్తంబులఁ బాఱవేయుఁ డదిగో♦ద్రాక్షాగుళుచ్ఛంబు తిం

దమురం డా తరులెక్కి కోయుదము పం♦డ్లన్ రండటం చాడి బ్రం
దములై బాలురు వెంటరాఁ దిరుగునా♦తం డుత్పథాధీనుఁడై.
జనకుం డుగ్రతఁ గొట్టిచూచె గురుఁడా♦జ్ఞాపించి దండించె నా
జనయిత్రీమణి తిండిపెట్ట ననుచున్ ♦ శాసించె. దమ్ముండు శో
భన మార్గంబిది కాదు మానుమనె నె♦వ్వండేమనుం దాను బ
ట్టిన కుండేటికిమూఁడె కాళ్లనుచుఁ గ్రీ♦డించున్ మహాస్వేచ్ఛతో.

ఇట్లాధుంధుకారికిఁ బ్రాయంబుతోఁ బాటు దురాచారం
బును బెరుగసాఁగెను. 123

స్నానమే లేదు సంధ్యయు ♦ శౌచ మేడ?
పిత యనియె లేదు దీనాంధ♦పీడ కేమి?
కులమె లేదా యెఁబీనుఁగు♦కూడు దినఁడె?
ఇల్లు విడిచె సర్వ భ్రష్టుఁ♦డేల కాఁడు? 124

బాలకులఁ గొందఱంగని
లాలన మొనరించి దవ్వ♦లం గొనిచని మైఁ
గ్రాలురవణములఁ గైకొని
పాలసుఁడవ్వారిఁ జంపి♦వైచున్నాతన్. 125

కౌలేయకయుతుఁడై మృగ
యాలోలతఁ దిరిగి మృగచ♦యము ద్రుంచుచుఁ జాం
డాలాభిరతిఁ జరించుచుఁ
గూళ యతఁడు దిరుగు జన్న♦గొడ్డుం బోలెన్. 126

మైరేయమ్మును ద్రావుచుఁ
జోరత్వంబున ధనంబు ♦ జోడించుచు వే

శ్యా రతుఁడై సర్వులు చీ
క్రూరుండని తెగడ సతముఁ ♦ గ్రుమ్మరు నతఁడున్. 127

కుక్కవలె నొక్కదినమున
నక్కటిలుం డింటి కరిగి ♦ యటునిటు గని యే
మొక్క రగపడమిఁ గలిగిన
రొక్కము సర్వంబు గొని ప♦రుగు దీసెవడిన్. 128

మఱియొకనాఁడు తమ్ముఁడు స్వ♦మందిర సీమను లేఁడటంచు గు
ర్తెఱిఁగి గృహాంబు సొచ్చి తన♦వృద్ధ పితంబడమోది తల్లి గు
ల్లుఱిమి భయంబుగొల్పి తన♦యోపినయన్నియమూల్యవస్తువుల్
బిరబిరఁగొంచుఁబోయె గల♦వే? విటకోటికిఁ బాపపుణ్యముల్.

* ఆత్మదేవుఁడు కొడుకుంగూర్చి విలపించుట *

అంతట నాత్మదేవుఁడు మ♦హాత్తర దుఃఖదవాగ్నికీలికా
క్రాంత మనస్కుఁడై కనులఁ♦గాలువగట్టఁగ నశ్రు లీగతిం
జింతిలె దైవమా! తనదు ♦ చేతుల నే కొనితెచ్చుకొన్న దీ
చింత యిఁకేరినందు హరి! ♦ చేసినవారికిఁ జేసి నంతయే. 130

ఎచ్చటనుందు? నెచ్చటికి ♦ నేగుదు? నేరికిఁ జెప్పుకొందురా
వచ్చెను దీఱరాని వెత ♦ బాపురె! పుత్రులు పుత్రులంచు నా
కిచ్చ జనింపనేల? ముని ♦ యిచ్చుటయేల? యతండు దుష్టుఁడై
గ్రొచ్చుటయేల? నేఁగుడిచి ♦ కూర్చక నెత్తికిఁదెచ్చుకొంటిఁగా.

దుఃఖ దాయకుఁడగు ♦ దుష్పుత్రు కన్నను
గొడ్డుఁబోతుఁ దనమె ♦ దొడ్డది సుమి

యతివరుండు చెప్పి♦నది వినఁబోక నా
కొంప నేనె త్రవ్వు♦కొంటి నకట! 132

కట్ట! యే నానాఁడు ♦ కట్టిన దీతాగ
మెడకు మంగళసూత్ర♦మే? మదీయ
గళమున కురిత్రాడు♦గాక యేయొకదినం
బాదైన నింతసౌ♦ఖ్యంబు గనన
ఇస్సిరో! యెప్పుడు ♦ నింటిలోఁబోరిగా
కదలించినఁ బేఁగుఁ♦గంప యడప
పెండ్లాముఁ జూడనీ ♦ విధముగా నున్నది
యిఁకఁ గొడుకుం గూర్చి♦యేమి తలఁపఁ?
లేక లేక నొక్క ♦ లోకాయ పుట్ట లో
కాయ కన్ను లొట్ట♦యాయె నిట్లు
నా యుసురునె వీఁడు ♦ నానోటఁ గొట్టుచు
న్నాఁడిఁ కెట్లు బ్రదుకు♦వాఁడ నేను. 133

మునివర్యుఁడు మొదటనె చె
ప్పెను మూర్ఖుఁడనోచుఁ బలుకు ♦ వీనులఁ జొనుపక
గను నే సౌఖ్యము హితవా
క్య నిబద్ధుఁడుగాని మాన♦వాధముఁ డెందుక. 134

జనులారా! వినుఁడయ్యా
తనయులు మీకేమి త్రవ్వి ♦ తలకెత్తరు నా
యనుభవమిది నమ్ముఁడీ నం
దను లొదవియు నొదవకయు వ్య♦థల్గూర్తురిలక. 135

అని విలపించుచుండ గోకర్ణుం డరుదెంచెను. వానిం
జూచి బిట్టువాపోయి. 136

అజసుతుఁడు కొడుకా! కొడు♦కా! యటంచు
నందనుం దలంచుచు న ప్రా♦ణములు వదలె.
బాపురే! యదేకర్మము ♦ దాపరించె
నాకుఁగూడ నటంచు డెం♦దమునఁ దలఁతు. 137

వడలేను నాయనా! యీ
కొడుకు వలన నింద కొంప ♦ గుల్ల యొనర్చెన్
బడితెల పూజయు జరిగెం
గొడుకా! నీవాగొ చూచు♦కొందుర యింకన్. 138

* గోకర్ణుఁడు తండ్రికి హితముచెప్పుట *

అన గోకర్ణుఁ డిటుల్ వచించె జనకా! ♦ యారీతి నీవేటికి
న్మనమం దెంచెద? విట్టి చావు నెపుడై ♦ నన్విజ్ఞుఁడొందం దలం
చునె? నీవేమవివేకివా? శ్రుతితతుల్ ♦ శోధింపవా? ప్రాజ్ఞులే
గినమార్గంబు నెఱుంగవా? బలిమిమైఁ ♦ గీడొందఁగాంక్షింతువా!
ఘోరతరోరుదుఃఖములఁ ♦ గూర్చును సారములేని పిచ్చి సం
సారము మోహపెట్టు బుధ ♦ సంఘముఁగూడ నొకప్పు పుత్రులె
వ్వారలు? విత్తమెవ్వరిది? ♦ పాఱఁగఁ జూడుము స్నేహమున్న చో
నాఱక వెల్గుచుండు జన♦కా! భవదీప మనారతంబిలన్. 140

తనయులు చెప్పిన మాటల
వినరంచును వగతు వెంత ♦ వెఱ్ఱివి! మీసం
బును గడ్డంబును వచ్చిన
వెనుక సుతులు పితలమాట ♦ విందురటయ్యా! 141

చాలును జాలునీదగు వి♦చారము వీఁడుకుపుత్రకుండుగాఁ
డేలన నీకు మేల ఘటి♦యించెద విరుద్ధము లాచరించి, యీ
మూలముగాఁగనైన మదిఁ ♦ బుట్టె విరక్తి వివృద్ధిసెంది నీ
కాలము వెళ్ళఁగావుత సు♦ఖంబుగఁ బుణ్యతపోవనంబునన్. 142

అఱువదియేండ్లనుండియుభ♦వార్ణవమందు నెయుద్దుగుద్దుచున్
బొరలితి వేమిసౌఖ్యములఁ♦బొందితి? కాఁటికిఁ గాళ్ళుచాచియుం
గరము తపింతువేర కొడు♦కా! కొడుకా! యని పిచ్చితండ్రి! యీ
తెరువుత్యజింపుమా! యనుమ♦తింపుమజ్ఞాన విరాగమార్గమున్.

అమిత సుఖప్రదంబయిన♦యావనమా చనె, నీప్సితార్థ జా
లము నొడఁగూర్చు నింద్రియము♦లావిక్రుతాలయి వట్టుదప్పెఁగా
లము చనుదెంచి చెంగట♦నిలంబడెఁ జేతులుచాచి యింతనే
మమతన హంతనుక్కడపు♦మా! వరలోకము దారిచూడుమా!

ఆయుష్కాలము దీఱె మేనువడు ప♦ర్యంతం బిదే పాటయా?
నా యిల్లంచును నా కళత్రమనుచు ♦ న్నా పుత్రులంచు న్సదా
నాయర్థంబనుచుం దపించుట, యిఁకై ♦నన్ దృశ్యమీ సర్వము
న్మాయా కార్యమటంచు నెంచికనుమా♦త్మన్ గాఢవైరాగ్యమున్.

సంపాదించుచు సౌఖ్యపెట్టువరకే♦ జాయాళి ప్రేమించెడిన్
సంపాదించి సమస్త మిచ్చినను నా♦జ్ఞావృత్తి యట్లుండ నీ
క్షీణత్వంబోరు సగౌరవంబుగ సుతుల్ ♦నీ! వార్ధకంబందు సే
వింపంబోక తపోవనంబు, గృహిగా♦వేఁజేల? మాయావ్యథల్.

అంబుధివేష్టితైతత దళ♦లావని నేలెడి చక్రవర్తి లో
కంబులు మూఁడునేలు సుర♦కాంతుఁడు సౌఖ్యమునొంద లేరు స

ర్వంబుఁ ద్యజించి నిర్భర వి♦రాగముతోడ వివిక్తమందుఁ గా
లంబునఁ బుచ్చువారి విపు♦లంబగు సౌఖ్యము నొందు నాయనా!

వదలు ప్రజారూపాజ్ఞా
నదశన్, మోహంబు వలన ♦ నరకము గదె యె
ల్లఁ దొలంగి వనమునకుఁ బో
మ్ము దేహమట రాలిపోవు ♦ ముక్తి లభించున్. 148

అనువాక్యంబుల నాలకించి జనకుం♦డాడెన్ గుమారా! వనం
బునకుం బోయెదఁ గాని పోయియటచే♦పోల్కిన్ జరింతున్ వచిం
పు నితాంతంబును గర్మమార్గమున నే♦పోతి న్మహోజ్ఞాన కూ
ప నిమగ్నుండ నపారమోహనిగళా♦బద్ధుండ నెట్లోగదే. 149

అనిన గోకర్ణుం డిట్లనియె. 150

భావింపు మిథ్యయిది యని
రావింపు నిగాఢతర వి♦రాగం బెడఁదన్
సేవింపు మునిజనాంఘ్రులఁ
గావింపు దదేకదీక్ష ♦ జ్ఞానాధ్వరమున్. 151

మమతఁ ద్యజింపవయ్య ధన♦మందిర దారసుతాదులందు, దే
హము పలలాస్రముఖ్యయుత♦మందభిమానము వీడవయ్య, లో
కము క్షణభంగురంబిదిగో ♦ కాంతువుగాదె యనారతంబు, భ
క్తి మహితనిష్ఠఁ బూనుమయ♦కృత్రిమ గాఢవిరాగ మాత్మలో.
ఇంపుగ ధర్మమాత్మభజి♦యింపు, త్యజింపుము లోకధర్మ మా
లింపు త్రయీశిఖాళి విద♦ళింపు మసహ్యపుఁ గామతృష్ణ సే
వింపుము సాధుపుంగవుల ♦ వీడు పరస్తుతి నిందల, న్నిగా
రంపు కథాసుధారసము త్రావుము త్రావుము పొట్టనిండఁగన్.

పుణ్యకాననమున మహా ♦ మునుల కరుణ
వడసి వారుచెప్పినయట్లు ♦ నడచుకొని కృ
తార్థులరుగంటు వీఁడె మీ ♦ కాదువాఁడు?
వనటచేతఁ గర్తవ్యంబుఁ ♦ గనరుగాక. 154

అని గోకర్ణుండు పలికెను. 155

అటుపిదిఁ యేండ్లు పైఁబడిన ♦ యాయవనీసురుఁడమ్మహార్థ భా
సురమగు మాటవీనులను ♦ సోకఁబ్రశాంత మనంబుతో వనాం
తరములకేగి మాధవ క ♦ థామయ భాగవతామృతంబు ను
స్థిరమతిఁద్రావుచున్ హరిభ ♦ జించితదైక్యము సెందె నావలన్,

అని సనకాదులు నారదున కెఱింగించిరని సూతుండు
పలికె. 157

స్రగ్విణి॥ ఆదిమధ్యాంత శూ ♦ న్యా! జగత్కారణా!
నాదబిందద్వంశ సం ♦ తత్యువర్యుజ్జ్వలా!
వేద వేదాంత దు ♦ ర్భేద్య నైజాకృతీ!
ధీదిశాకాల స ♦ త్కృత్యతీతస్థితీ! 158

—: గ ద్య ము :—

ఇది ఉభయభాషా ప్రవీణ వేదాంతపారీణ మిన్నికంటి
గురునాథశర్మ ప్రణీతంబైన శ్రీ పద్మపురాణోత్తర
ఖండస్థ శ్రీమద్భాగవత మహిమ మందలి
చ తు ర్థా ధ్యా య ము.

శుభమస్తు.
అవిఘ్నమస్తు.

# శ్రీమద్భాగవత మహిమ.

## పంచమాధ్యాయము.

శ్రీ సర్వమంగళాంచ
ద్భాసుర గేహా! గజేంద్ర♦వర్ధన కారో్య
ల్లాసా! త్రైయంత విహా
రాసమ పాదాంబుజాత ! ♦ హరిహరనాథా ! 1

అవధరింపు మవ్వాల సూతుం డిట్లనియె. సనకాదులు
మానులు వినుచుండ నారదునితో నిట్లనిరి. ఆత్మదేవుం డట్లు
కృష్ణైక్యము చెందిన పిదప. 2

సౌఖ్య దుఃఖమ్ములను మిత్ర ♦ శత్రువులను
సమముగాఁ జూచు గోకర్ణుఁ ♦ డమల యోగి
విధుఁడు పితృమేధమును యథా♦విధిగ సలిపి
పిదప సర్వతీర్థముల సే♦వింప నరిగె. 3

* ధుంధుకారి పాపకార్యము లొనర్చుట *

క్రూరాచారుండైన ధుంధుకారియో. 4

వారి వారి వలనఁ దండ్రి ♦ వార్త వినియు
వారిఁ దోఁగి యెట్టులో తిల♦వారియే న

వారిగా విడువక యింటి♦వారిపై స
వారి దీయవచ్చెను మాన♦వారి వాఁడు. 5

తడికె తలుపు వంటి ♦ తండ్రి యడ్డము దీసి
స్వేచ్ఛగా గృహంబు♦చేరి ధుంధు
కారి తల్లి మొత్తఁ♦గాఁ గొట్టి ధనమేడ
దాఁచితివె? వచింపు ♦ తల్లి ముండ! 6

అని వేధించుచు గో కుమారకుఁడు లేఁ♦డా యె న్మదీయాజ్ఞ చొ
ప్పున నీయిల్లిఁక నాఁగనౌను సకలం♦బున్నాదె నేనే గృహం
బున కీశుండ నటంచు నై చుగుడు రో♦పూఁబోణ్లఁ బిల్పించి యిం
టనె స్థాపించెను దల్లి మొత్తుకొను చుం♦డం దిట్టుచా ధుంధులిన్.

ఆతఁడు రోవెలందుల గృ♦హంబున నిల్పుకొని గాక యానతుల్
చేతుల వండిపెట్టిన భు♦జింపవె రండ! గయాళిముండ! నీ
పాతిన డబ్బులెందె బడ♦వా! యెటనున్నదె చెప్పుమంచు న
మ్మాతను దిట్టి పైబడి ♦ మర్దనచేసెను గాలుసేతులన్. 8

వరునిపైనొ? యిరుగు♦పొరుగు వారల పైనొ
సతుల తాగతనము♦సాఁగుఁ గాని
యన్ని విధములఁ జెడి ♦ యఘభీతి లేని కు
పుత్రు కడను సాఁగఁ♦బోవ దెపుడు. 9

ధనమది లేదురా! యెచట ♦ దాఁచఁగ లేదుర! కొట్టఁబోకురా
యని బతిమాలుచున్న విన♦కాతఁడు బిగ్గఱగాఁగ నేడ్తువే
విని పదిమంది చేర నిను ♦ వీరును వారును వచ్చికాతురే?
యనుచును గొదలొత్తి ఖలుఁ♦డాయువు పట్టునఁదన్నెనుగ్రుఁడై.

భోగముదాని తిండిఁ దినఁ♦బోవక మూఁడుదినాలనుండి యే
యోగిరమంటకున్న ముది♦యగ్గలి వగ్గు తదాహతిన్ ధరన్
జాఁగిలి పడ్డఁ గుట్టుసురు ♦ చయ్యనఁ బాసెను బీడపోయెనం
చాగడకాఁడు సంతసిలి ♦ యామెకు సల్పెఁ డనంతరక్రియల్. 11

"చిన్నతనముననే ♦ చెప్పినమాట వి
నండాయె నిఁకయౌవ♦నంబుగూడ
వచ్చుచున్నది వీనిఁ ♦ బట్టఁబగ్గములుండ
వూరిపైఁ బడకుండఁ ♦ డొక్క యెదిగి
నట్టి పిల్లను మెడఁ♦గట్టిన నాఁకుది
బండతోఁ గదలఁబో♦వం"డటంచుఁ
దలఁచి పెండ్లికొనర్చెఁ ♦ దండ్రి వీని కట్టైనఁ
గథ యష్టముగఁ దిరు♦గఁబడె నౌర!

తానొకంటు తలఁప ♦ దైవమొండు దలంచెఁ
గాఁపురంబున కది ♦ కాలిడఁగనె
చావఁ జితికఁగొట్టి ♦ సర్వస్వము హరించి
సాఁగ నంపె నెవరి ♦ సరకు గొనక. 12

వెలిచవులు మఱిగియుండిన
తులువలు కాఁపురము చేయు♦దురె పెండ్లముతో
లలన రతియైనఁ జెడిపలఁ
గొలుతురు పొరుగింటి పుల్ల♦కూర రుచియగున్. 13

కఱవు దీఱనైదు♦గురు వేశ్యలతనికిఁ
గామ తృష్ణ యెంత♦గలదొ కాని

కలుపుదీలు దొడమి ♦ కార్చుచున్న గణికా
కామ తృష్ణ యెంత ♦ గలదొ కాని. 14

ఆస్తామ్మని యీస్తామ్మని
యాసింతు రొసంగకున్న ♦ నగుదురు విముఖుల్
చేసెడి దేమత(డసువుల
యాసవిడిచి చౌర్యమున ధ♦నార్జన సలుపున్. 15

గోమారుల రీతిని వే
శ్యామారులు వాని(బట్టి ♦ యత్నము ద్రావం
గా మారుగొడ్డు దినమున
వేమారు లయినను జార్య♦విధికిం దిరుగున్. 16

మాన్యముల్ మొదలు స♦మస్తము పిత్రార్జి
తమ్మది యేనాడొ? ♦ వమ్ముసేసె
గొడ్డుగోదల(బసి ♦ దొడ్డితో(పులనైన
వలికా మొలకు తెగ♦బలికి వేసె
మున్ను నా(చికొనిపో♦నున్నట్టి నగనట్ర(
గులటల యొడలిపై( ♦ గులుక(జేసె
ఇంటి లోపల మిల్లి♦గంటెవలకునున్న
పాత్ర సామగ్రిని ♦ బాడుసేసె
ఒకతె ముచ్చటాడ ♦ నొకతె యడుగు లొత్త
నొకతె వీడియమ్మ ♦ లొసగుచుండ
నొకతె కలహమల(ద ♦ నొక్కతె మొయినాను
కొస(గ నాత(డిల్లు ♦ కొల్లవెట్టె. 17

జేపా మాపో నవ♦రింతుఁ దప్పక యని
పుట్టుచో నెల్ల న♦ప్పులను దెచ్చు
అంగడి వాఁడు మా♦యనుఁగు చొకగమీా స
రుకుఁ దెత్తునని తీయు ♦ రొక్కమెల్ల
ధన వత్ప్రధికులతోఁ ♦ జనుచును నడుదారి
విషపదార్థము పెట్టి ♦ విత్తమెనయు
ఒంటిగా నెవ్వఁడు ♦ కంటం బడినవాని
గొంతు పిసికి యున్న♦దంతలాఁగు
చూచుచుండంగఁ గనుపాపఁ ♦ జోకచేయు
దారి గాచి కొట్టును బెడ♦దారి దీసి
గుంజు కొనుఁ గన్నములువైచి ♦ కుమ్ముకొనును
ధనమునకు వాఁడు చేయని ♦ తప్పు లేదు. 18

మొదట నాణెములను ♦ బిదప బంగారమ్ము
నంత రాజతమ్ము ♦ నవలమేలు
వస్త్రములను బైని ♦ బాత్రమ్ములను వాఁడు
దోఁచి తెచ్చియింట♦వైచుచుండు. 19

"నాయనా! ధనముగొను ప్రా♦ణాలు దీయఁ
బోకు. మీాతఁడొక్కఁడె నాకుఁ ♦ బుత్రకుండు
దండములు దయచూపు" మన్ ♦ తల్లిహస్త
సహితముగఁ గత్తితోఁబుత్రుఁ ♦ జంపివైచు. 20

## * వేశ్యలు ధుంధుకారిం జంపుట *

ఇట్టులు జాలిలేక వధి♦యించి గ్రహించుచుఁదెచ్చి యింటిలో
గుట్టలువైవ నాధనముఁ ♦ గోమలు లారసి ముక్కుమీాఁదఁద్రే

ళ్వెట్టి యిదేమిడ? బ్రతని ♦ వృత్తియదేమిటి? యెన్నినాళ్ళిటుల్
గుట్టుగనుండు నిప్పటికి ♦ గుబ్బటిలంగఁ దాఁడం గె(గ్రామమున్.

ఇంత వచ్చిబూతఁ బె! యీతఁ ♦ డింతగాఁదె
గించునబె! యరరె! దినంబు ♦ మంచిదనుచుఁ
బట్ట పగలె కన్నంబులా? ♦ యిట్టివాని
నమ్మి మనకు మాత్రమును భ♦ద్రమ్ము గలదె? 22

బళిరె! యానోట నానోటఁ♦బడినృపాలు
చెవికి నెక్కవె? యీతని ♦ చెనటిఁ జేత
లాతఁడీ సర్వము హరించి ♦ యతని తలను
దీసి కోటకొమ్మకు ౹ వ్రేలఁ♦దీయకున్నె 23

కావున నింకిటన్నమము ♦ కాఁపురముంపుట గూడ, దుంటిమా
భూవిభుచేతఁ ౹ బ్రాణములు♦పోవుట తథ్యము పాటిపోతిమా
యీవను వెల్లనూడు మఱి ♦ యీహతవాదిని గన్నొలంగి యే
తావుననుంచ? మెట్టులొక♦దా? వెనుకన్ను ముందునోయియున్.

అని యయ్యెవ్వరు వేశ్యలొకనాఁడు గుట్టపడి గుట్టుగా నాలోచించుచుండ నందొకర్తుకసంపంగియను వేశ్యయిట్లనియె.

ఏమె యేమేమె వీఁరివ్వ ♦ డేమి తిట్ట
లేని నేనొక్క దెబ్బతో ♦ రెండుగాదు
మూఁడువండ్ల రాల్చుదు రాజు ♦ ముప్ప దొలఁగు
ధనము దక్కు నీచెనఁటి బా♦ధయు నడంగు. 26

అనవుడు దక్కిన నలువురు
వనితా! నీచెప్పచేఁత ♦ వర్తిలెదము కా

దని యడ్డు చెప్ప మేమె
ల్ల నీ బురదనుండి కాలు♦లాఁగినఁజాలుదె. 27

అనిన సంపంగి యిట్లను ♦ నమ్మలార
యిష్టమున్నఁ జేయుఁడు చేయ♦లేనిమానుఁ
డంతెకాని పొక్కుఁడు నా♦ప్రాణములకు
వచ్చెఁదప్పినయెడల దై♦వంబు తోడు. 28

అనిన నానల్వురిలోఁ బ్రాయమునఁ జిన్నదైన లవంగి
యను వేశ్య యిట్లనియె. 29

ఎందుకే యక్కలార! మీ♦రింత గ్రుచ్చి
గ్రుచ్చి యడుగుట యదినాకుఁ♦గూడఁ దట్టె
దీని యీమాటలం బట్టి; ♦ వానిఁ బట్టి
మైపు లేకుండఁ జేయుద ♦ మనెదు నీమె. 30

అను నుడువుల్ చెవింబడిన ♦ యంతన సంపఁగి లేఁతగాను సు
స్తన ముకుళంబులుం దుఱుము ♦ జవ్వనమూఁగఁగ బిట్టునవ్వినా
మనమునఁ దూఱిచెప్పితివి ♦ మానిని! నీళులజాడఁ దీయుజా
ణను నినునమ్మరా దనఁగ ♦ నవ్వరి తక్కినవారు వేడుకన్. 31

అంతట నింతతెంపును బ♦లా! యబలల్ సలుపంగలారె? యం
చింతి యొకర్తు పల్కఁగయి ♦ యొత్తి మఱోర్తుక యొక్క వ్రేలు కా
సంతయుఁ జేయలేదెదియు ♦ నైదును గూడినఁ జేయునన్నవా
రింతయొనర్ప సమ్మతిలి ♦ రెగ్గుతలం బువులే శరంబులా. 32

ఆరేయి యైదుగురు నా
క్రూరుని కలసటను గూర్చి ♦ గుఱువెట్టుచు వాఁ

డో రగిలి గాఢనిద్రం
గూరఁగ నొకసారె మైదు♦గురు తొరతొరగా. 33

అటు కంఠంబును జేతుల
నిటు నడుమును బాద యుగము♦ నిరువైపుల నొ
క్కటఁ గట్టిరి ఖట్వాకు ను
త్కట పాశములను మెలపుఁ♦ గదలకయుండన్.   34

అంత మెడ కుచ్చువైచి యా♦ మైదుగురును
బట్టి లాఁగుదురేకాని♦ వాఁడు చావ
కఱచుచుండ నంపఁగి మండు♦ కొఱవులిన్ని
వడిగఁదెచ్చి ముఖమ్ముపై♦వైచియూఁదె. 35

కొన్ని కొఱవుల నోటిలోఁ♦ గ్రుక్కె నొకతె
కొన్నికొఱవులఁ గనులలోఁ♦ గ్రుచ్చె నొకతె
గొడ్డటనొకతె-భుజములఁ♦ గూల్చె నొకతె
పాదపాశ బంధమ్ములఁ♦ బట్టె నొకతె. 36

పాపములు చేయు నరులా
పాపమ్ములు కట్టికుడువ♦వా? యెటులైనన్
బాప మనుకొనక వడఁతులు
పాపపుఁ జావిచ్చి రల్ల♦పాపాత్మునకున్. 37

ఇంటి దొడ్డిలోన♦ గుంట లోఁతుగఁ దీసి
ధుంధుకారి నందుఁ♦ ద్రోసి పైని
మట్టిగప్పి రీస♦మాచారము బయలఁ
జింద దెంతసాహ♦సికలు స్త్రీలు! 38

ఏరయిన నాత్మదేవ కు
మారుఁ డిచటఁ! నన్న ధనస♦మార్జనమున కై
దూరమున కరిగె నిఁక నై
దాఱునెలలదాఁక రాఁడ♦టందురు నెలఁతల్. 39

వంచితుండు దుష్ట♦వనితల నెన్నండు
విశ్వసింపరాదు ♦ వేయొసఁగిన
విశ్వసించెనేని ♦ విపుల దుఃఖముల స
మ్మూర్ఢ చిత్తుఁడు పరి♦భూతుఁడగును. 40

బోటుల మాటలు తేనియ
తేటలు కాముకుల వలపుఁ ♦ దీవలఁ బెంచున్
మేటిలు మది క్షురధారకుఁ
బోటి, పడఁతుకలకుఁ బ్రియుఁడు ♦ బుడమిని గలఁడే? 41

వారకాంతల పాలయ్యె ♦ క్రూర కార్య
ములను జేసి తెచ్చిన మూట♦ముల్లెలెల్ల
ధుంధుకారి పాలయ్యెను ♦ దుష్పథమున
విహృతి సల్పుటచే మహా♦ప్రేత తనము. 42

బలవన్మరణముంగన్న ధుంధుకారి ప్రేతత్వముం బొంది.

సుడిగాలి రూపమునఁబ
ర్విడుచు సతము దశదిశలకు ♦ వేడికిఁ జలికిన్
మిడుకుచు నాఁకలిదప్పుల
కుడుకుచు దిక్కెవరులే ర♦యోయని వగచున్. 44

అచట సంపంగి లవంగి మున్నగు బహుభర్తృక లైదు
గురు కొంతకాలము గుట్టుగా నచటఁ గడపి యాయున్న ధనాది

కము సమముగా నైదుగురుందీసికొని యాయిల్లువాసి యథే
చ్ఛముగా సరిగిరి. దుర్మార్గుఁడు ధుంధుకారి యెందో మృతుం
డయ్యెనకాఁ బ్రజలు చెప్పుకొనిరి. 45

## * గోకర్ణుఁడు తీర్థయాత్రలకేగి వచ్చుట *

యోగరతుండు గోమణి తనూద్భవుఁ డాగమవేత్త తైర్థికుం
డా గయలోననున్న సమయంబున ధుంధులిపట్టి మృత్యుజి
హ్వాగతుఁడయ్యె నంచు విని ఫల్గుని చెంతవటంబు క్రిందఁగడ
భోగి శయానుపాదములముంగల శ్రాద్ధము వెట్టెవానికిన్. 46

మఱియు గోకర్ణుండు ప్రయాగలోఁ ద్రివేణీసంగమ
స్థానంబునను గాశిలో మణికర్ణికా ఘట్టంబునను నయోధ్యలో
సరయువుపొంతను మధురలో యామున విశ్రామఘట్టంబునను
హరిద్వారంబున బ్రహ్మకుండంబుకడను హృషీకేశంబున
సూర్యకుండంబు సమీపంబునను బ్రహ్మకపాలంబునను మరల
వెనుకకుం దిరిగివచ్చి జగన్నాథక్షేత్రంబున మార్కండేయ
తీర్థంబుకడను రాజమహేంద్రవరంబున గౌతమీ తీరంబునను
విజయవాడలోఁ గృష్ణాతీరంబునను నెల్లూరిలోఁ బెన్నకడను
గాళహస్తిలో సువర్ణముఖీతీరంబునను గంచిలోఁ బుష్కరిణిచెం
తను శ్రీరంగంబునఁ గావేరీతీరంబునను దర్భశయనంబున నాది
సేతువుకడను రామేశ్వరమున లక్ష్మణతీర్థముకడను ధనుష్కోటి
యందు రత్నాకర మహోదధి సంగమస్థానంబునను దక్షిణ
మధురలో వేగవతీనదీతీరంబునను నిట్లాతండు సందర్శించిన
సర్వ పుణ్యతీర్థంబుల గోధుంధుల్యాత్మదేవ ధుంధుకార్యాదు

లకుఁ దిలోదక పిండప్రదానాదులు యథావిధి నాచరించి కొంతకాలమునకుఁ దిరిగి గంధర్వ పురమున కరుగుదెంచెను. 47

యాత్రలకేగి వచ్చెడి మహామహులం బురివారు తూర్యవా దిత్ర రవంబుతో బయలుజేరి యెదుర్కొని తోడితెచ్చి యా ర్యాత్రికముల్ ఘటింతు రిటుప్రాభవమొందఁగ నేలయంచు గో పుత్రుఁడువచ్చె నేరుఁగనఁబోని విధిగ్ నడురేయి నింటికిన్. 48

వచ్చి యతఁ డేరి లేపుట
కిచ్చగొనక కడమరేయినీముంగిట నే
పుచ్చెదఁ గాకని మెల్లఁగ
నచ్చటఁ బండె నుపధానమై కర మెసగన్. 49

## * ప్రేత తన దీనస్థితిం గోకర్ణునకుం జెప్పికొనుట *

గోకర్ణుఁడు కనుమూయఁగ
నాకడఁగల ప్రేత మరరెయనుజుఁడురా ని
ద్రాకలితుఁడయ్యెనని రా
ద్రాకృతితోడఁ గనుపట్టె నాతని యెదుటన్. 50

ఒకపరి మేషమ్ముగ వే
ఱొకపరి మహిషముగ మఱియు నొకపరి కరిగా
నొకపరి సురపతిగా వే
ఱొకపరి యనలముగ నాతఁడొగిఁ గానఁబడెన్. 51

మఱి యతఁడంతలోపలనెమూగిన కందెనవంటి చర్మమున్ బొఱియలలోని గ్రుడ్లు సిరుబొత్తెకడంతలు బొక్కిఱొమ్ము జెం

జుటుకుటువెండ్రుకల్ చుటుకు♦జూపులు నెమ్ములుమాత్రమున్నమై
కటినిడుకోఱలొప్పఁగ వి♦కారపు రూపుగనై కనంబడున్. 52

ఇట్టివైపరీత్యంబుల♦నెల్లఁ గాంచి
యలుకు గొనక స్వాంతమున ధై♦ర్యమ్ము పూని
పాప మితఁడు దుర్గతికుఁ జె♦వ్వండొ? యంచు
నెంచి గోకర్ణుఁ డిట్లుప్ర♦శ్నించె వాసి. 53

ఉండుమురోరి నీవెవఁడ♦వుగ్రతరాకృతితోడ నేల ప
న్నుండిన నాకడ న్మెలఁగు ♦ చుండితి వీనిశియందుఁ జెప్పు దై
త్యుండవొ? ప్రేతరూపుఁడవొ?♦ యుగ్రపిశాచమవో?యనంగ నా
తండట వెక్కి వెక్కి బహు♦ధా విలపించె మహారవంబునన్. 54

అతఁడటు లేడ్చుచుండ వగ♦నందకు జెప్పఁకతంబటంచు గో
సుతుఁడన వాఁడు సన్నలను ♦ జూపుచుఁ బల్కవశక్తుఁడన్సమా
దృతిఁగనుమంచుమ్రొక్కెనపు♦డీయనఘుండభిమంత్రితాంబువుల్
పతితునిమీఁదఁ జల్లనవ♦లంబలుకందొడఁగెం బిశాచమున్. 55

తమ్ముఁడా! ధుంధులీ ♦ తనయుండ ధుంధుకా
రిని ద్వదీయుండ నే♦యనఘ చరిత!
చేసేతులను నేను ♦ జెడఁగొట్టుకొంటి బ్ర
హ్మత్వంబు నేమందు ♦ నయ్యనేడు
బహుళతరాజ్ఞాన ♦ వశుఁడనై యేనుస
ల్పిన పాపములకును ♦ లెక్క లేద
యీ పాడుచేతుల ♦ నెందఱిం జంపితి
నో మొఱవెట్టుచు♦నున్న వినక

అట్లయేఁగూడ స్త్రీలచే ♦ హత్యచేయఁ
బడితిఁ జేసినదనుభవిం♦పక యెటుగు?
నందువలన నీ ప్రేతత్వ ♦ మలమి కొనియె
దేవ! నాదుర్దశలఁ జెప్పఁ ♦ దీఱవయ్య? 56

సుర సుర లాడుచు క్షుధ దు
ర్భరమయ్యెడి గాలిచేత ♦ బ్రదికెద నదియుం
గలవే! దైవాధీనమె
ధరఁ బెట్టని వానికెట్లొ♦దవు పరమందున్? 57

తమ్ముఁడా! దయాళూ! యింకఁ ♦ దాళలేను
శీఘ్రముగను ప్రేతత్వంబుఁ ♦ జెండ వయ్య
యేను సల్పిన యొగ్గుల ♦ నెంచకయ్య
దీనులం గావఁబుణ్యమే ♦ తెంచు నయ్య! 58

అన గోకర్ణుఁ డిటుల్ వచించె నరరే! ♦ యాశ్చర్యమే నీదుచా
వును విన్నాఁడఁ బవిత్రమైన గయ,నా♦పూటన్ యథాశాస్త్రము
వ్వనముం జేసితి నీకుఁబిండముఁ దిలాం ♦ భఃపూరముల్ వానిచే
త నశింపంగనులేదె నీదయిన ప్రే♦తత్వంబదేమోకదే! 59

ఈ యవని గయాశ్రాద్ధం
బే మొసఁగదయేని ముక్తి ♦ గుటుపై నన్యో
పాయంబు లేవి గల? వీఁకఁ
జేయునదేమయ్య ప్రేత! ♦ చెప్పు మునర్తున్. 60

అనిన ధుంధుకారి యిట్లనియె. 61

శుభమతీ! వినుము గయా
శ్రాద్ధము లోకప్రశస్తమైనఁ ♦ జాలవు నాయీ

బద్ధత్వ ముడుపఁ వెదకు మ
మద్ధితముగ నెంచుకంత • మతికెయ్యెక వెరవుగ్. 62

అను నమ్మాటల గోసుతుండు వినియ•త్యాశ్చర్యముం బొంది పా
వన తీర్థంబున నూఱుశ్రాద్ధములె ని•ష్పాపు న్నినుంజేయఁ జా
లనిచో నీవని యింకసాధ్యమని వ•ల్కంజాల నైనగ్ హాతం
బున యత్నింతును బొమ్ము నీదయిన తా•వుంజేర నిర్భీకతగ్. 63

అంతం బ్రేతమ్ము నిజస్థానమ్మున కరిగె. గోకర్ణుండు
రాత్రిశేషంబంతయు విచారంబుసోఁగడపియు నుపాయాంతర
మును గానండయ్యెనంత. 64

* గోకర్ణుఁడు సూర్యోపాసన మొనర్చుట *

కలవు లేక బ్రదుకు • పరమహంసాదుల
తమ్మపొలాలను • వమ్ముచేసి
కర్మముల్ సల్పఁబో•క యజాగరూకులై
పడి యుండ ద్విజజాతిఁ • బాడుచేసి
బ్రాదు సర్పముగ స•ర్పమును బ్రాడుగ నరుల్
భ్రమపడనున్న స•త్యమును మాటి
ప్రాఁగ్రొత్తపలుకులు • పలుక నేర్చిన శుకా
దుల నోళులకు దాళ•ములను వైచి

మృగధరా! ద్విజరాజత్వ•మొనయఁ దగవు
తమ్ములలరఁగర్మమ్ములు•దనర సత్య
శోభదగ శుకోక్తు లెసఁగ • శూరుఁడేల
నేచెఁబొమ్మని ప్రాచి క•న్నెఱ్ఱ చేసె. 65

స్వరత్రయిఁ బుషుల్ ♦ సన్నుతుల్ సేయంగ
నచ్చరల్ ముందు నృ♦త్యములు సలుప
గంధర్వులు మనోజ్ఞ♦గానంబు లొనరింప
గ్రామణుల్ రథచోద ♦ కతను బూన
నాగులు రథబంధ♦నమున రజ్జులు గాఁగ
బలశాలులగు దైత్య♦వర్య లెలమిఁ
బిఱిఁది దెస వహించి ♦ యరదంబు ముందుకు
దొరలి పోవంగను ♦ ద్రోచు చుండ
వాలఖిల్యు లర్వదివేల ♦ బ్రహ్మఋషులు
తన కభిముఖంబుగా నిల్చి ♦ యనవరతము
శ్రుతి చయంబులతోడ సం♦స్తుతు లొనర్ప
నరుగు దెంచెను సూర్యనా♦రాయణుండు. 66

అంతకు మున్న గోకర్ణుండు తత్కాలోచిత కృత్యంబులు సలిపియుండె. 67

గోకర్ణుఁడు గోకర్ణుఁడు
గోకర్ణుఁడు వచ్చె ననుచు ♦ గుములై జనులా
లోకింపఁగ వచ్చిరి సుగు
ణాకరులను నరులు ప్రీతి ♦ నరయుదు రెపుడున్. 68

పండితులు యోగివరులును ♦ బ్రహ్మవాదు
లనఘ చరితులు జ్ఞానులు ♦ నచటఁ జేరి
రపుడు రేజరిగిన విష♦యంబు చెప్పి
చూడుఁడా వెరవంచు గో♦సుతుఁడు నుడువ. 69

తిరుగ వేసిరి శాస్త్రముల్ దెచ్చి సరగఁ
జర్చచేసిరి సమధి కో త్సాహమునను
ఫలము శూన్య, మవ్వల నేక వాక్యముగను
గర్మసాక్షియే యొకఁ డరి మ్మ_ర్త యనిరి. 70

అంతట గోకర్ణుండు యోగ విభావితాంతఃకరణుండై సూర్యు నిట్లు ప్రార్థించెను. 71

నీవు విధాతవు నీ వచ్యుతుండవు
నీవు శివుండవు సిరుపమాంగ!
నీవు కల్పంబవు నీవు యుగంబవు
నీవు వత్సరమవు నిఖిల సాక్షి!
నీవు ఋగ్వేదము నీవు యజుస్సును
నీవు సామమ్మును నిత్యమూర్తి
నీవు భూతంబవు నీవు భావివి నీవు
వర్తమానంబవు పరమపురుష

నీవు కర్తవు కర్మవు నీవు ఫలము
నీవు జ్ఞాన మరాగము నీవు భక్తి
నీవు సచ్చిదానందుండ వీవు విభుఁడ
వందవే నతుల్ సూర్యనా రాయణుండ! 72

పరమాత్ముండవు మాయవీవె సగుణ బ్రహ్మంబు నీవే విరా
ట్పురుషుఁడీవె హిరణ్యగర్భుఁడును జీవుం డింద్రియంబుల్కళే
బరము న్నీవె దశల్ దశావధులు సర్వం బీవె నీకానిదీ
స్థిరనొక్కండును లేదు మ్రొక్కు గొనవే శ్రీసూర్యనారాయణా! 73

ప్రకృతిస్థుండనుగానఁ దత్ప్రకృతి నిర్బంధంబుచే నెన్ని పా
తకముల్ చేసితినో క్షమింపవె విపద్బంధూ! యటంచొక్క సా
రి కరంబుల్ ముకుళించి మ్రొక్కఁగనె సంప్రీతుండవౌ జాలిగుం
డా కలాఁడా! ననుగావవే నెనరుఁజూడ్కిన్ సూర్యనారాయణా!

అను కంపామతి నీవు చూడని దినంబందీజగంబెల్ల నా
శనమౌ. భూతకృతానుసారము సమస్తంబుం బ్రచోదింతు దే
వ! నితాంతంబును నీవొకండవె గదా ప్రత్యక్ష దైవంబ వీ
జనునిం బ్రేతము నుద్ధరింపఁగదె యీశా? సూర్యనారాయణా!

అని గోకర్ణుండు ప్రార్థించి "ఆసత్యేన" మంత్రము నేడు వేలు జపింప సూర్యమండలము నుండి వార్షుకాభ్ర నిర్ఘోష ప్రతిస్పర్థియైన గంభీర ధ్వానంబుతో "శ్రీమద్భాగవతాన్ముక్తిః సప్తాహం వాచనంకురు" అను రెండు వాక్యములు ధర్మస్వరూపములు వెలువడె వాని నెల్లను నాలించివిస్మయావిష్టస్వాంతులైరి.

## * గోకర్ణుఁడు భాగవత సప్తాహ మొనర్చుట *

అప్పు డందఱుం జెప్పి రత్యంత సుకర
మైన యీపని చేయ వయ్యా యటంచు
నాతఁడుంబూనె సప్తాహ యజ్ఞమునకు
నప్పుడే గుప్పమని పౌక్క నప్పురమున. 77

తెలిసిగాని తెలియకగా చేసిన
కలుషంబులు పోవు రండి కథ వినఁదమటం
చెలమిం బరస్పరమ్ముం
బిలుచుకొని జనమ్ముమవచ్చి విడిసిరి చుట్టున్. 78

మన పాప మెట్టయెదుటనె
కనఁబడు చున్నయది రండి ♦ కథవిందము పో
వును బాపమంచు వచ్చిరి
మునుకొని పం గ్వంధ వృద్ధ ♦ మూక జడాదుల్. 79

గోకర్ణుఁడు భాగవతము
కై కొని కూర్చుండ నెన్ని ♦ గ్రామములో తదీ
యాకర్ణనమునకును రా
వాకులు వెఱఁగు పడిరయ్యొ ♦ హో జనమునకున్. 80

అంతట గాలి రూ♦పగు ధుంధుకారియు
నచటికి వచ్చి యుం♦దందుఁ జూచి
తా నుంట కేదియా ♦ స్థానమంచు వెదకి
కడకుఁ గన్పడ నేడు ♦ కణుపులున్న
పొడవు వెదురుకఱ్ఱ ♦ పోలఁగా నందులో
మొదటి మూలచ్ఛిద్ర♦మునను జొచ్చి
భాగవతము విను♦వనికి వసించెను
వాతరూపి మఱేడ ♦ వరలఁ గలఁడు

అంత గోకర్ణుఁ డొక వైష్ణ♦వావనీసు
రాగ్రణిని బ్రధాన శ్రోత♦గా గ్రహించి
మొదటి స్కంధము మొదలుగాఁ ♦ జదివి స్పష్ట
ముగఁ దదర్థంబుఁ జెప్పుచుఁ ♦ బోవుచుండె. 81

కొఱఁకుల కేగి పక్షితతి ♦ గుంటురి బావుల చేదుత్రాడు నాఁ
బరిధిగ బారుగట్టి దివిఁ ♦ బాఱుచు గూళ్ళకుఁ జేరవచ్చె భా

స్ఫురదుడు మణ్యొక్కచోటి కరు♦గం దన తేజము వహ్నికిచ్చి భా
సురు లొంగి సంధ్యఁ గొల్వఁ జనఁ♦జూచిరయా మలిసంజ నారదా?

అప్పు డొకవిచిత్రము జరిగినది. వినుము, గోకర్ణుండు శ్రీమద్భాగవతమునఁ బ్రథమస్కంధము పందొమ్మిది యధ్యాయములు ద్వితీయ స్కంధమునఁ బదుమూడవ యధ్యాయాంతము వఱకుఁ జదివె. హిరణ్యాక్షుని యజ్ఞపోత్రి వధింప మహాఋషులా హరిం బొగడిరి. “తస్మిన్ ప్రసన్నే సకలాశిషాం ప్రభౌ కిందుర్లభం…… ……అని పదుమూఁడవ యధ్యాయమున నలువది తొమ్మిదవ శ్లోకము చదువుచుండఁగా ఫట్టున వెదురు కణుపు పగిలెను. ఆశ్చ్ర మెల్లరు విసిరి. అందఱుం జూచుచుండ నావంశగ్రంథి యట్లు నిష్కారణముగఁ బగులుట యేలో తెలిసికొంటివా? అంతట గోకర్ణుం డవ్వలనున్న యేకశ్లోకముం జదివి స్వస్తిచెప్పి పురాణమాపె. నామ సంకీర్తనాదులైనపిదప నందఱుఁ దమతమ గృహముల కేగిరి. పిమ్మట 83

బ్రాహ్మణులు యథావిధి హవి♦ర్భాగముల నొ
సంగ వాని వేల్పుల మెస♦వంగఁ జేయఁ
జదల వహ్నిపోయెడినో నా♦సాంధ్యరాగ
భూతి దోఁచఁగఁ గరకర ♦ బ్రొద్దుపొడిచె. 84

సకల జనులు కాల్యములు దీ♦ర్చికొని వడిగ
నప్పురాణంబు వినుటకై ♦ యరుగుదెంచి
రా ద్వితీయ దినంబున ♦ నక్కథకుఁడు
శ్రద్ధతో భాగవతమును ♦ జాటుచుండె. 85

గోకర్ణుఁ డీదినంబునఁ దృతీయస్కంధమునఁ బదునాల్గవ యధ్యాయము ప్రారంభించి ముప్పది మూఁడవ యధ్యాయము వఱకును మఱియుఁ జతుర్థస్కంధము ముప్పదియొక్క యధ్యాయములును బంచమ స్కంధమున మూఁడవ యధ్యాయము సాంతము ఋషభావతారమువఱకుం జదివె. నారదా! యీయధ్యాయాంతమందలి తుదివాక్యము. ....."భగవాన్ ధర్మాన్ ధర్మయితు కామో అవతతార" అని చదువు చుండఁగా నవ్వెదురు రెండవ కణుపు ఫటక్కుమని పగిలెను. 86

హరియే తచ్ఛ్రవణంబున
కరుదెంచుట ధర్మ వపన ♦ మలమెనో నా భూ
మిరుహాగ్రంబులు శైలశి
ఖరములు నుప్పరిగె లరుణ♦కాంతులఁగ్రక్కెన్. 87

సురనది శోణయయ్యెఁ బరి♦శుద్ధహిమాద్రి సుమేరువయ్యె వి
స్ఫుర దురు చందనద్రువులు ♦ పూచిన మోదుగులయ్యె సౌధశే
ఖరములు దివ్యకాంచన వి♦కారములయ్యె నభంబుమానికం
బరరె ప్రవాళమయ్యె జర♦ఠాతపమల్లనఁ గ్రుంచెఁద్రిప్పఁగన్. 88

అంత నాద్వితీయ దివసంబునఁ బురాణమాపి లేచిరి. పిమ్మట 89

ఉదయగిరి శిఖరంబుపై ♦ కుష్ణ రశ్మి
రథము నీడ్వఁజాలక యతి ♦ శ్రమము పడుచు
నున్న గుఱ్ఱాల నోటి నుఱుఁర్వ యనంగ
దెసలు తెలుపెక్కె భల్లునఁ ♦ దెల్లవాఱె. 90

పొట్టకుఁ డింటకొఁగ్గఁ దన ♦ పూఁ పెరతేనెఁ జివుళ్ళరాల్పఁ బోఁ
డెట్టి యకృత్యముల్ సలుపఁ ♦ జేటికి భృంగముఁ బద్మకారలోఁ
బెట్టితి! రంచు వానివిడి ♦ పించెను దూరుపుఁ గొండగద్దెఁగా
ల్పెట్టుచు నేదినేశ్వరుఁడు ♦ విప్పగు తేఁకుల తల్పులూడ్చుచున్.

మూఁడవ దినంబున గోకర్ణుండుదయకాల కృత్యములు దీర్చికొని గ్రంథమందికొని యైదవస్కంధమున నాలవ యధ్యాయము మొదలిడి యిరువది యాఱవ యధ్యాయమువఱకును మఱియు షష్ఠస్కంధము పందొమ్మిది యధ్యాయములును సప్తమస్కంధమున నెనిమిదవయధ్యాయాంతమువఱకుం జదివె. అందు హిరణ్యకశిపు సంహారించిన శ్రీనృసింహుని ఋషులు స్తోత్రము చేయుట కలదు. "విప్రశప్తస్యేదం నిధనమనుగ్రహాయ విద్మః" అని చివర శ్లోకము చదువుటతోడనే తదున్నత వంశతృతీయగ్రంథి భేదనమయ్యెను. 92

వనజసఖుఁడు ప్రతిక్షణం ♦ బునను రెండు
వేలఁ రోఁబధి యామడల్ ♦ వింటిపైని
బరువులెత్తుట నలసట ♦ పడియొ నోటు!
కూరుచుండెను బడమటి ♦ కొండమీఁద. 93

పైదలికిన్ రుచించు నెర ♦ ద్వాదశిపారణకై ఘటింతు నం
చాదటఁ జక్రవాకము స ♦ రోంబుల రోయుచు వెన్కఁ జిక్కముం
దీఁది నెలంత యాకుమఱుఁ ♦ గేర్పడ భర్తను గానకుల్కుచున్
రోదనమాచరించెడిని ♦ క్రూర నిశాసురు రాఁకదోఁచఁగన్. 94

అంతనాటికిఁ బురాణమునకు స్వస్తిచెప్పిరి. అవ్వాల

ఋషివరేణ్యు లేడ్గురు తల♦క్రిందులై రి
యొక్కరొక్క రెఱక్కలు ♦ నక్కుచుండి
రిందుఁడుం గాలుకొలఁది ప♦ర్వెత్తి జలద
ఖండమున డాఁగెఁజిత్ర భా♦నుండు పొడువ. 96

అంగనలంగనుంగొనుచు ♦ నాఁగఁగముల్ గురులం గలంచుఁబై
టంగదలించు గండసిక♦లంబున లేఁజెమటార్చు వీఁగుఁజ
న్నుంగవమెల్లఁగాఁ దొడఁకు♦నాత్మవధూహృదయంగమక్రియా
చంగుఁడొ! వేకువందిరుగఁ♦జూచుసమీరకుమారుఁడూరిలో. 97

అపుడు గోకర్ణుండు సంధ్యావందనాదికము ముగించుకొని నాలవదినంబున సప్తమస్కంధమునఁ దొమ్మిదవ యధ్యాయము మొదలు పెట్టి పదునైదధ్యాయములు నావల నష్టమస్కంధ మిరువది నాలుగధ్యాయములు నటుపై నవమస్కంధమునఁ బందొమ్మిదవ యధ్యాయాంతము వఱకుం జదివె. యయాతి చరిత్రము పూర్తియయ్యె. "సర్వత్రసంగముత్సృజ్య స్వప్నావమ్యేన భార్గవి కృష్ణేమనః స్సమావేశ్య వ్యధునోల్లింగ మాత్మనః" అనుశ్లోకము చదువుటతోడనే ప్రేతవసించియున్న వంశమ్ము చతుర్థగ్రంథి యుద్భిన్నంబయ్యె. అందఱాశబ్దము నిత్యము వినుచున్నట్లే వినిరి. అప్పుడు 98

పశ్చిమ దిశాంగనా నృత్య♦భంగిమమున
జీరులాడు హొన్నెమ్మి పిం♦చియపుఁజీరె
కుచ్చెళ్ళు లనంగ నెఱ్ఱని♦కొనలతోడి
యాగడపలొప్పెఁ బుడమి క♦ల్లంత చోట. 99

భారద్వాజ కులంబు వానికె యుషః♦పర్యంతకాలంబునన్
స్వైరవ్యాపృతికభ్యనుజ్ఞయనుచున్ ♦ శాసించె నీరాత్రిభూ
దారుం డెన్నడు పక్షపాత రహిత♦త్వం బేర్పడిన్నిల్పునో
పౌరాశేషమెలర్పనంచు ద్విజముల్♦వాపోవు నీడంబులన్. 100

అట్టితఱి గోకర్ణుండు "నమస్తుభ్యం భగవతే వాసుదేవాయ వేధసే సర్వభూతాధి వాసాయ శాంతాయ బృహతే నమః" అని నమస్కరించి స్వస్తిచెప్పి నీరాజనమిచ్చి లేచెను. అంత రాత్రి గడవ. 101

చప్పునఁగన్నువిచ్చి హరి♦సంస్తుతి నాత్మఁబొనర్చి చంటిపై
నొప్పిన నాథుకేలుఁబయి♦నుండిన కాలుఁ దలంగిరోయుయ్యే మేన్
ద్రిప్పి యడంగికంకటిని♦దిగ్గి వరాంఘ్రుల నంటి మ్రొక్కికైఁ
గొప్పును జైఁటసర్దికొని♦క్రొత్తడి వెల్వడె సిగ్గు కంగవన్. 102

ఐదవదినంబున గోకర్ణుం డహర్ముఖోచిత కృత్యమ్ములు దీర్చికొని కూర్చుండి నవమస్కంధమున నిరువదవ యధ్యాయము ప్రారంభించి యిరువదినాలుగధ్యాయములు, నావల దశమస్కంధమున నలుబఁది నాలుగవ యధ్యాయాంతము వఱకుఁజదివె. అందుఁగృష్ణుండు కంసు వధించి తలిదండ్రుల చెఱవాపె. "మోచయిత్వాఽథబంధనాత్ .... అనుచుఁ జదువుచుండఁగాఁ బ్రేతం బున్నవంశము పంచమగ్రంథి పెఠిల్లునఁ బగిలెను. అయ్యవసరంబున. 103

వృద్ధునైతిఁ జెలువు ♦ లేల? యీజంజాట
మేల! యంచుఁ గావు ♦ లోలిఁగట్టి

యపరదిశను భూధ♦రా రణ్యమున శాంతి
పూని కరము మొగిచి ♦ పాలిచెఁ దరణి. 104

మధ్యాక్కర॥ వరుణు నంతఃపురాంగణవి♦భాగమునకొకదాసేయ
వరుగునవచ్చి వృద్ధాత♦పముఁగని పాఱఁబోసితినో?
వరకుంకుమంబని భయము♦పడి పగడపుఁబెట్టెలోకిఁ
గరపల్లవమున నెత్తుచును♦గార్యాంతముగనకవిసివె.

అప్పుడు కడమ శ్లోకముఁ జదివి స్వస్తిచెప్పి పుస్తకము నర్చించి గోకర్ణుండు లేచె. పిదప 106

ఎలమిం గూటికి గుడ్డ కేకొఱఁత రా♦నీ నెవ్వఁడున్ స్నేహవ
ర్తుల సాంగత్యముఁ గూర్తు మీకనిగృహా♦స్థుండాడిమాయానపె
న్బలిమిన్ గద్దియ నెక్కియవ్వలఁదలం ♦ పండాయె మమ్మంచు ది
వ్యలు వెల్వెల్లన బాఱె నక్క ఆయిపో ♦ నల్లుండె గొల్లండగున్.

తామరల విందు జక్కవ ♦ నోముపంట
పొలయలుకబోంట్ల గుండెలోఁ ♦ బొడుచుఁగాల
మొల్లప్రాఁజదువుల ముద్ద ♦ పొల్లువోని
వెలుఁగుల కొటారు జమునయ్య ♦ విన్నుప్రాఁకె. 108

గోకర్ణుండు తత్సమయ సముచిత కర్మకలాపంబు లాచరించి కూర్చుండి యాఱవనాఁడు దశమస్కంధమున నలువదియైదవ యధ్యాయము నారంభించి యెనుబది యాఱవ యధ్యాయము తుదివఱకుం జదివె. మైథిలుని శ్రీకృష్ణుఁడనుగ్రహించుటాయె. "ఏవంస్వభక్తయో రాజన్ భగవాన్భక్తభక్తిమాన్ ఉషిత్వాదిశ్యసన్మార్గం పునర్ద్వారవతీమగాత్" అని చదువుట తోడనే యాఱవకణుపు పెటిల్లునఁ బగిలెను. అంతలో 109

బరులుబ్బం గడుపాఱమేసి బహుళాం ♦ భారావముల్ సేయుచున్
ఖురటంకోత్థ ధరాపరాగము నభో ♦ గోళంబునం ద్రోయుచున్
సరసోధోభర రుద్ధయానములతోఁ ♦ జంచన్మహోల్లాస భా
సుర వక్త్రంబులతోఁ బురంబునకు గో ♦ స్తోమంబు లేతెంచెడిన్.

గోకేరులన్నాగు ♦ కొనుచెట్టులా జరద్గ
వమ్ము లునూరున ♦ వచ్చుచుండె
పచ్చిపుల్ దోఁకుచుఁ ♦ బాల్ చేఁపురాఁ జెర
చెర కాపెత గృహమ్ము ♦ చేరుచుండె
తడవాటఁ బిల్లలు ♦ తమవానిఁగనఁ గులా
యమ్ములఁ గిచకిచ ♦ లాడుచుండె
రవిపడుచున్నాఁడు ♦ రండు రండని నీడ
లిర్లఁబిల్వఁగఁ బ్రాచి ♦ కేగుచుండె
అచట నచటఁ జక్కలు కొన్ని ♦ యరుగుదెంచి
ప్రాణ విభునకై తూర్పుగా ♦ నరయుచుండె
సాముదాయ కారావంబు ♦ గ్రామసీమ
నుండిరోదోంతరంబుల ♦ నిండుచుండె. 111

అప్పుడు వడివడిగ గోకర్ణుండు పాత్రముమూసి మంగళము చెప్పి లేచెను. అంత 112

గోచయము దోహనమున ది ♦ క్కులును మ్రోసె
మలయ పవమానుఁ డతను శ్ర ♦ మమ్ము ద్రోసె
వితత దీపికాశోణిత ♦ ద్యుతులు మూసె
గూళ్ళఁగొక్కొరోకో యని ♦ కోళ్ళుగూసె. 113

జనులన్నంబులు లేక వండ నెచటం ♦ జారత్వ చోరత్వముల్
దనరారన్ బహుళార్థముల్ మఱుగుహాం♦దన్ జంద్ర!పాలింతే?చా
లునుగూర్చుండుము పశ్చిమాద్రిననిము♦ల్లోకంబులానందముం
గనధర్మాత్ముఁడు వేదమూర్తిరవి ప్రా♦కై్శలంబుపై కెక్కెడిన్. 114

ఆ నాఁడించుక ముందుగా గోకర్ణుండు శ్రీహరి స్తవ మొనర్చుచు నిదుర లేచి సమధికోత్సాహంబున సంధ్యావంద నాదికము నిర్వర్తించుకొని పురాణము చెప్పుతావునకు వచ్చి కూర్చుండె. ప్రతిదినంబును వచ్చునట్లానాఁడును గ్రమక్రమముగా నెల్లరుం జేరఁబారిరి. సభకలకల లాడుచుండెను. ఇష్ట దేవతాస్తోత్రాదిక మొనర్చి గోకర్ణుండు దశమస్కంధమున నేను బది యేడవ యధ్యాయము దొరఁకొని తొంబదివఱకుం జదివి వెంటనే ఏకాదశస్కంధము ముప్పదియొక్క యధ్యాయము లును ద్వాదశస్కంధము పదుమూఁడధ్యాయములును జదివి యర్థము చెప్పుచు గ్రంథము పూర్తిచేసెను. "నామ సంకీర్త నంయస్య సర్వపాప ప్రణాశనమ్ ప్రణామో దుఃఖశమనస్తం నమామి హరిం పరమ్" అని చదువుట తోడనే ప్రేతమున్న వెదురుగడ యేడవ కణుపు పెళ్లునఁ బగిలెను. ఈయేడు దినంబులును ప్రేతరూపుండైన ధుంధుకారి ద్వాదశస్కంధ ములు మూఁడునూర్ల ముప్పదియైదధ్యాయములుగల శ్రీమద్భా గవతమును భక్తిశ్రద్ధలతో వినెను. సప్తమగ్రంధి భేదనంబగుట తోడనే యెల్లరు విస్మయ చలితస్వాంతులగుచుండ. 115

## * ధుంధుకారి గోకర్ణునగ్గించుట *

తులసీదామ మురంబునం బొదలఁగాం♦తుల్ చిమ్ముచున్ రత్నకుం
డలముల్ వీనుల నృత్యమాడ నవల♦గ్నంబందు భర్మాంబరం
బొలయన్ శీర్షముపైఁ గిరీటరుచు లు♦ద్యోతింపఁగా నొక్క శ్యా
మల వర్ణుండగు దివ్యరూపుఁడు సభా♦మధ్యంబునన్ భాసిలెన్.

అతఁ డతి వేగంబున గో
సుతు డాసి నమస్కరించి ♦ సూరివరా! సం
స్తుత చరిత! యాప్తబంధూ!
గతపాపుఁడనైతిఁ బ్రేత ♦ కశ్మల ముడిగెన్. 117

ప్రాప్తించిన ప్రేతత్వము
లుప్తంబై పోవ గృష్ణ♦లోక మొదవఁగా
సప్తాహ సవము సలిపితి
వాప్తత నా నిట్టిదే? మ♦హాత్మా! జోతల్. 118

ఏడు దినంబుల సవనం
బేఁడుసలుపు వాని సర్వ♦వృజినము లడఁగున్
బాడు పిశాచాద్యఘతను
వూడసిఁ బాడు నపుడపుడ♦హో జనులారా! 119

వాఙ్మనః కాయముల సల్పఁ♦బడిన పాప
మద్ది యార్ద్రమైనను శుష్క♦మైన స్థూల
మైన లఘువైన సమిధను ♦ నగ్నివోలెఁ
గాల్చివేయు నీశ్రవణంబు ♦ కాల్చి వేయు. 120

ఎముకల కంబంబు ♦ తెలయించి సన్నపు
నరములతోఁ గట్టి ♦ యెఱచి నల్ల
పూసి తోలుదొడిగి ♦ చేసినా రీమేను
కాల్మడి మసటుల ♦ కంపు గొట్టు
ముదిమియు వగపును ♦ ముసురు కొనుచు నుండుఁ
బలు తెవు ల్పైప్పడు ♦ వట్టి తివుచు
నిముసమేఁ దిరముగా ♦ నిలుచు న న్నమ్మిక
లేనిది చెడుకొలల్ ♦ నిండు కట్టె
అట్టి పాడుబొంది ♦ యందేల ప్రామిక
దీని యాదరువును ♦ బూని మేలి
కతను విన్నఁ జాలుఁ ♦ గా సుకపడవచ్చు
నిత్తమైన ముత్తి ♦ పొత్తు కలిమి. 121

కండచక్కెరవోని యీ♦కతను జెవుల
విందువుగ వినఁడేని యీ♦పసు వదేల
కండలం బెంచుకొని మేసిఁ♦గాచి కొనుట
కూడ దీనని కట్టని ♦ గొడ్డు కొలువు. 122

ప్రొద్దున వండిన వంటక
మద్దివసాంతమున కెల్ల♦నడ సాలఁ జెడుఁ
దద్దయు నది తినఁగఁ బెరిగి
పెద్దయయిన మేను చిరము ♦ వెలుఁగుచు నున్నే. 123

సతవగళ్ళ వినికి ♦ నతి కుతుకము నొంది
యచ్యుతుండు చింత ♦ కరుగు దెంచు

దోసములఁ దొరంగ ♦ దొడ్డ సాధన మింత
కన్న వేఱొకండు ♦ కలదటయ్య. 124

జంతువుల మశకంబుల ♦ చందమునను
దోయముల బుద్బుదంబుల ♦ చాయ భాగ
వతము వినని మానవులు కే♦వలము మరణ
మొందుటకె పుట్టినారను ♦ చుం దలంతు. 125

శ్రావ్యమగు భాగవత కథా♦శ్రవణ మునను
జడమయిన యెండిపోయిన ♦ గడకె ముళ్ళు
బ్రద్దలై పోవ నజడ మా♦ర్ద్ర మగు నరుల
యెడఁద ముడి విడిపోవుట ♦ కేమి వింత? 126

ఎవ్వ రేడుపవళ్ళు ♦ లీకథ విందురో
వారి సంశయములు ♦ పాఱి పోవు
నెడఁద ముడియుఁ బ్రిదులు ♦ నింకఁ గర్మములకు
నిలువ నీడయేడఁ ♦ గలదు సూడ. 127

ప్రబల సంసార కర్దమ ♦ పటల లేప
నంబుఁ బ్రక్షాళనమ్ము నో♦నర్ప జాణ
భాగవత కథా తీర్థ మా♦వారిఁ బడయు
వారి చేతిలో ముక్తిస♦వారి దీయు. 128

అని యతఁడు పలుకు చుండఁగఁ
గనులంబడెఁ గనక ఘంటి♦కా ధ్వానము భ
క్త నికాయాధానము ర
మ్య నవచ్ఛవి భాన మొక వి♦మానము చదలన్. 129

## * గోకర్ణ వైమానిక సంభాషణము *

అవ్విమానస్థులైన వైకుంఠవాసులు రివ్వనవచ్చి యెల్లరు చూచుచుండఁ బ్రేత తా విముక్తిం భాసిల్లు ధుంధుకారిని విమానముపైఁ గూర్చుండఁ బెట్టికొని పోవుచుండ నందలి వైష్ణవులం జూచి గోకర్ణుం డంజలిఘటించి నమస్కరించి యిట్లనియె. 130

స్వాములు! వందనములు మీ
కోమల పదదర్శనమున ♦ కుం బాత్రులమౌ
చో మాటలకు న్నోవమె?
మామాటల నాలకించి ♦ మన్నింపుఁ డిదన్. 131

ఇక్కడ నెందఱో కలర ♦ యిందఱు భాగవతమ్ము నిత్యముం
దక్కక వించునుండి రిఁకఁ ♦ దా మిపుడీ వినినట్టి వారిలో
నొక్కనినే గ్రహించి చన ♦ నొప్పునొకో? ఫల భేదమేటికి
న్నక్కొని? యందఱున్ సరిగ ♦ నే వినిరే! కత మానతీయరే! 132

అనఁగా నా హరిదాసు లిట్టులనిర ♦ య్యా! గోసుతా! యెల్లరు
న్వినుచున్నారు సమంబుగానె యయిన ♦ న్విన్నట్టి యర్థంబొగిన్
మననంబుం బొనరింప రీతఁడొ చలా ♦ త్మన్నిల్పె నన్నంబుఁగై
కొనఁ డాపై మననంబుసల్పె దృఢదీ ♦ క్షుం డిన్ని నాళ్ళీవిధిన్. 133

అనఘ! రెండుకడల ♦ వినుట సమంబైన
నితనియందు దీక్ష ♦ యెక్కుఁ డయ్యెఁ
గాన ఫలమునందుఁ ♦ గల్గెను భేదంబు
పిండికొలఁది రొట్టె ♦ యెందుఁగాదె. 134

శ్రుతము ప్రమాదముచేతన్
హతమగు సందిగ్ధమయ్యె ♦ నా మంత్రమ్మున్
హతమగు నదృఢము జ్ఞానము
హతమగుఁ జలచిత్తుజపము ♦ హతమగు వింటే. 135

విష్ణుచిత్తులు లేని యు♦ర్వియు నపాత్ర
కంబయిన శ్రాద్ధ మాచార ♦ కలన లేని
కులము, వేదమ్మెఱుంగని ♦ కూళ కిచ్చు
నట్టి దానంబు గోకర్ణ! ♦ హతము హితము. 136

కించిద్జ్ఞుఁడ నేనంచుఁద
లంచి మనోదోషములఁ దొ♦లఁచి విశ్వాసం
బుంచి గురునోడులఁ గథ నా
లించిన స్థిరమతికి ఫలము ♦ లేకెట్లుచనున్. 137

నాయన! మదిని విచారముఁ
బాయు పునశ్శ్రవణ మునను ♦ వైకుంఠము వి
చ్చేయుదురు వీరు గోలో
కాయతి నీకొదవు హరిస్వ♦యమ్ముగ నిచ్చున్. 138

అని పలికి వైష్ణవులు శ్రీ
వనజాక్షుని దివ్యపాద♦పద్మంబులఁ గీ
ర్తనసేయుచు వైకుంఠ
మ్మున కరిగిరి యెల్లరాత్మ ♦ ముల వెఱఁగుపడన్. 139

అంతట గోకర్ణుండు తన ప్రయత్నము ఫలించినందుల
కతివేలానందముంబొంది స్వస్తిచెప్పి పూజాదిక మాచరించి

నామసంకీర్తనానంతరము సభ చాలించి లేచెనని సనకాదులు వచించిరని సూతుండు చెప్పెను. 140

ప్రమితాక్షరము॥ సదసద్వ్యభిన్న శుచి ♦ సాధన సం
పదఖండకల్పిత స♦మస్త జగ
త్సదనాంతరాధ్యుషిత ♦ సాక్షికలా!
ఉదయాది భావరహి♦తోరు బలా! 141

—: గ ద్య ము :—

ఇది ఉభయభాషా ప్రవీణ వేదాంతపారీణ మిన్నికంటి
గురునాథశర్మ ప్రణీతంబైన శ్రీ పద్మపురాణోత్తర
ఖండస్థ శ్రీమద్భాగవత మహిమ మందలి
పంచమాధ్యాయము.



శుభమస్తు.
అవిఘ్నమస్తు.

# శ్రీమద్భాగవత మహిమ.

## షష్ఠాధ్యాయము.

శ్రీరమ్యావేష! మునిమం
దారా! మాయా విదూర ♦ ధర్మాకారా!
నారాయణీమనోబ్జ వి
హారి మృదుల పాదయుగళ ♦ హారిహారనాథా! 1

అవధరింపు మవ్వల సూతుఁడిట్లనియె. అంతట నార
దుండు సనకాదులతో గోకర్ణుం డవ్వల నేమిసేసెనని యడుగ
సనకాదు లిట్లుచెప్పిరి. 2

### * గోకర్ణుని ద్వితీయ సప్తాహమున హరి ప్రత్యక్షమగుట *

మరలఁ శ్రావణ మాసము
చొరఁబడ నవమి మొదలుకొని ♦ శుచియై వినిచెం
బురవాసుల కేడువవ
ళ్ళరుసముతో గోసుతుఁడు శు♦కాంచ తూక్తుల్. 3

సప్తాహ యజ్ఞాంతమున 4
భుం భుం భుమ్మని పాంచజన్యరవముం♦బూరించుచుం బక్తిరాట్
శుంభ ద్యానముపై మహారయము సం♦శోభిల్ల నేతెంచి గో

డింభా గ్రేసరుఁ డో న్న మాద్విజవ రే♦ష్టి త్రాణశీలాయ యం
చుం భక్తిం బ్రణమిల్ల మాధవుఁడు వి♦ష్ణుం డక్కునం జేరిచెన్. 5

జయ కేశవ! జయహరి! యను
జయారవము నిండె ధరణి ♦ సర్వేశ దయా
మయ తే నమో నమోయన
వియత్తలము నిండెనట్టి ♦ వేళన్ వింటే. 6

గోవిందుఁడు గోసుతునకు
గోవిందాకారమిచ్చి ♦ కూర్మింగనె వ
క్షోవీథి హరికి లక్ష్మీ
దేవి యొసఁగకున్న గుఱుతు ♦ తెలియ దుభయులన్. 7

హరిఁ దలఁచిననే చాలున్
హరి సందర్శనము గూడ ♦ నమరెం బైఁగా
హరి కరతల సంస్పర్శము
హరిహరి! హరిరూప మతని ♦ కబ్బుట యరుదే! 8

కోటానకోట్ల యా♦ర్కులఁదెచ్చి యొక్కచో
దింపివైచిన నింత ♦ తేజుగలదె?
సప్త సప్త జగాల ♦ చక్కఁదనము తెచ్చి
కుప్పపోసిన నింత♦యొప్పుగలదె?
రకరకంబుల నవ♦రత్నాల రాసులు
గాఁబోసినను నింత ♦ కాంతి గలదె?
కలయమృతంబెల్ల ♦ గరిసెపోఁతగఁ గురి
సిన నింత తనుప్రభా♦సిల్లిఁ గలదె?

అది కిరీటమా! యయ్యది ♦ యాననంబ!
యవ్విసొమ్ములా! యవి చిఱు♦నవ్వులా! య
టంచు భౌతిక దృష్టుల ♦ కంది నంత
వఱకు నెఱచూఱలిచ్చిరా ♦ ధరణి నరులు. 9

నాభిక్రిందికిఁ గట్టి♦నాఁడేల పీతాంబ
రము కచ్చపోసి యం♦దములు చిలుక
బొజ్జమీఁదనుగూడఁ ♦ బొరలాడ వలయునా?
మెడలోని వనమాల ♦ మిసిమి గ్రాల
వనమాలపై వ్రాల ♦ వచ్చిన బంభర
మా? యది శ్రీవత్స♦మా? యురమున
నంతపొడవు చేతు♦లా? శంఖ చక్ర గ
దా కార్ముకంబులఁ ♦ దాల్చినాఁడు
అమ్మవారిఱొమ్ము♦నందుంచుకొనె? స్వామి
వారుభక్తవరులఁ ♦ జేరఁజనుట
యేగునప్పుడిన్ని ♦ యేలొకో యీసొమ్ము
లన్నియవయవమ్ము ♦ లందుఁగూడ. 10

ఇంతచక్కనివాఁడె! ♦ యీసొమ్ములేలయా
తావులయందమ్ము ♦ దాఁగుచుండ
ఇంతటినెనరున్న♦దే చూపులందు వై
కుంఠ మందెపు డెట్లు ♦ కూరుచుండు?
ఇంతటి మెత్తని ♦ వే పాంజ! లెగుడు ది
గుడు ప్రోఁత శ్రుతులపై ♦ నడుచు నెట్లు
ఇంతటి దరహాస ♦ మే! మొగమ్మున గర్క
శ క్రూర దైత్యులఁ ♦ జంపు నెట్లు

ఇంత యౌదార్యగుణమె యీ ♦ రేడు జగము
లోకమాత వెంటంబడ ♦ నుడ్డుగుడుచు
కొనఁడె? వీరికిండ్లుం దిండ్లుఁ ♦ గూర్పఁగలఁడె?
యిందఱకును బంగరు వల్వ ♦ లీయఁగలఁడె? 11

ఆ బొడ్డుగుంటలో ♦ నా? జగంబులను సృ
జించు విరించి జ ♦ నించి పెరిగె
ఆ నామగుంట క్రిం ♦ దా? పుట్టుకయె లేని
స్వామికిఁబుట్టు మ ♦ చ్చవిలసిల్లె
ఆ బొమ్మగుంటలో ♦ నా? యమ్మవారి క్రీ
డాగార మున్నది ♦ యాడుకొనఁగ
ఆ బొజ్జగుంటలో ♦ నా యజాండములు కో
టానఁ గోటులు గుమ్మ ♦ టాలు దిరుగు
ఇతఁడె జనముకోర్కు ♦ లీడేర్చు నెఱదాత
ఇతఁడె కూడుగుడ్డ ♦ లిచ్చు తండ్రి
ఇతఁడె పాపముల ద ♦ హించువాఁ డీనాఁడు
కంటివారకనుల ♦ కఱవు దీఱ. 12

అని యీ సభలోని జానపదాదులు తమతమ బుద్ధు
లతో హరిగుణగణాదులు గొలుచుచుండ నందఱకు సారూప్య
ముక్తిలభించెను. అయ్యుత్తరక్షణంబుననే 13

ఎప్పుడు గట్టితి ♦ మీభర్మవసన మీ
నేఁత యున్నదటయ్య ♦ భూతలమున
ఎప్పుడు దాల్చితి ♦ మీకిరీటంబు నీ
పోఁత యున్నదటయ్య ♦ భూతలమున

ఎప్పుడు పెట్టితి ♦ మిన్ని భూషణము లీ
చేత యున్నదటయ్య ♦ భూతలమున
ఎప్పుడు వేసితి ♦ మీపూలదండ లీ
ఛాతి యున్నదటయ్య ♦ భూతలమున

ఏమి భాగవతమొ? ♦ యేమి గోకర్ణుండొ?
ఏమి వినుటయో? యి♦దేమొ? యేమొ?
అంతయును విచిత్ర ♦ మంతయును జరిత్ర
మంతయును బవిత్ర ♦ మహహా! యహహా! 14

పదునాల్గు జగముల ♦ పంక్తులు బొమ్మరిం
డ్లవలెఁ గన్పట్టుచు♦న్న వదియేల?
ఉచ్చావచప్రాణ ♦ భృచ్ఛయంబుల నభి
న్నంబైన ప్రేమము♦న్నదదియేల?
ఆకాంత నీయమా ♦ నర్థం బొకండుఁగా
నంబడఁజాల కు♦న్నదదియేల?
బ్రహ్మాండములలోని ♦ శ్రావ్య దృశ్యార్థ సం
తతి గ్రాహ్యమాచను♦న్నదదియేల?

అన్ని యనుభవించి♦న ట్లన్ని యున్నట్లు
తిన్నఁగాదు మఱియు ♦ నున్నఁ గాద
ఏదొ తనిసికో ల♦దేదియో యానంద
మెడఁద సందులేక ♦ యడరెనేల? 15

అని విష్ణుసాయూజ్య భాగ్యము లభించిన పురాణశ్రోత
లందఱెడందలం దలంచుచుండిరి. 16

కుఱు వెంద్రుకల త్రోలు ♦ కోమల నీలమే
ఘశ్యామలాంగంబు♦గాఁ జెలంగ
నాలుగుకాళ్ళుఁ గ్ర♦న్ననఁ గ్రమతర చతు
ర్భుజములై జానువుల్ ♦ ముట్టుచుండ
వ్రేలాడు చెవులు వా♦విరి రత్నకుండలో
ద్యచ్ఛ్రవణంబులై ♦ తాండవింప
మెడలోని సడికియు ♦ మృదు వికస్వర సూన
వనమాలయై కుక్షి ♦ పైనటింప
వంపుతోఁక పైఁడి ♦ వలువ కచ్చగఁ గుల్క
వదన రోమరేఖ ♦ పట్టెనామ
మై వెలుఁగఁ బురాణ ♦ మాలకించుచునున్న
వేఁపి గూడ విష్ణు♦రూపి యయ్యె. 17

నారదమునీంద్ర! యటఁ బురా♦ణవచనములు
వీనులంబడ్డ పశు పక్షి ♦ వివిధ భూత
ములును భగవ దనుగ్రహం♦బున సరూప
తా మహాశ్రేయసము పొంది ♦ రేమ నెదము. 18

వీరందఱు శ్రీమహావిష్ణువు దివ్యవిమానంబులం జేర్చ నపుడు గోకర్ణుండు చేతులుమోడ్చి. 19

గుణితక్రమచంపకము ॥

కమలదళాక్ష! కామిత సుఖ♦ప్రద! కిట్యవతార! కీర్తనీ
యమహితనామ! కుక్షిలుఠ♦దబ్జజ! కూర్మవిలాస! కృష్ణ! కే
శిమదవిదారి! కైటభవి♦జిత్వర! కోమలదేహ! కౌస్తుభ
ప్రముఖవిభూష! కంజరుహ♦వందిత! కర్బురభాసురాంశుకా!

అని వేఁడుకొన నరహరి యిట్లనియె. నమ్ము నాయనా! నిపుణముగా నీచేసిన నుతినూరీకరించితిని. నృతతిలో న్ప్రాణము నెమ్మి నేర్చిన నైష్ఠికుఁడవు. నొడలదొంతుల నోసరించు కొనుచు నౌచితిమెయి నన్నభీష్టవరంబు మనఃప్రియకరంబడుగు మిత్తునన నతండిట్లనె. 21

దేవ సుప్రసన్న♦భావ! యీగ్రామస్థ
జీవకోటి నెల్లఁ ♦ గావవయ్య!
యనఁగ నపుడ నిల్పి ♦ యాశ్వచాండాలకు
లము విమానచయము♦ల న్మురారి. 22

యోగివరు లేగు తన లోక♦మొందఁ జేసెఁ
గథను వినినభక్తు ♦ గోకర్ణుఁ గూడి
కృష్ణుఁడరిగె గోలోకము ♦ హృష్టుఁ డగుచు
నీశుఁ డలరిన నీరాని ♦ దేది కలదు? 23

రాముఁ డయోధ్యావాసులఁ
బ్రేమంబునను గొనిచన్న ♦ విధమునఁ గృష్ణ
స్వామియు గంధర్వాఖ్య
గ్రామ ప్రజలఁ గొని నిజపు♦రమ్మున కరిగెఁ. 24

తరణి మృగాంకుల కాంతులు
చొరఁజాలవు సిద్ధులేని ♦ చూడంగా నే
రరు దానిని వైకుంఠముఁ
బరికించిరి ప్రజలు భాగ♦వతము వినికిచే. 25

కర్ణానందముగాఁగ భాగవత సద్గ్రాథాళి విన్పించి గో
కర్ణుం డేదినమందు సర్వులకు మోక్షశ్రీల నిప్పించె దు
గ్ధార్ణోరాశిశయానుచేత సదయుండై నాఁడె యాయూరు గో
కర్ణక్షేత్రమటన్న పేరుగని భక్త స్థానముల్ తీర్థముల్. 26

అలవియే చెప్ప సప్తాహ యజ్ఞ మహిమ
మా కథల విన్నవాఁ డెవ్వఁడైనఁ గూడ
మాతృ దుర్భర గర్భ సంబంధ మొనయఁ
జాలఁడయ్యె యీవయి వేయి చాటనేల? 27

ఆకో? నీరో? గాలియొ? తిని యదియు లేక
వాయి గట్టి శరీరమ్ము వడియఁ జేసి
యుగ్ర తపముల నుజ్జ్వల యోగములను
బడయరాని సిద్ధానిచేఁ బడయవచ్చు. 28

చిత్రకూట పర్వతమునఁ జేరియున్న
మునివరుండు శాండిల్యుండు పుణ్యవంత
మైన యీ యితిహాస మొయ్యనఁ బఠించి
యనుపమంబు బ్రహ్మానంద మనుభవించె. 29

ఓ నారద! యీ పరమా
ఖ్యానము విన్న నరు కల్మషాద్రులు భస్మం
బౌ నిది శ్రాద్ధములఁ జదువ
మానుగఁ బితృ తృప్తి జరుగు మాటలింకేలా. 30

అన నారద మునీంద్రుఁడు సప్తాహ శ్రవణ విధానము
వివరముగా వక్కాణింపుఁడన సనకాదు లిట్లనిరి. 31

## * భాగవత సప్తాహ శ్రవణ విధానము *

భువిలోపల సప్తాహ
శ్రవణ విధానమునఁ గోర్కి♦వ్రాలెనె? శ్రద్ధా
భువ వగుచు వినుము దానికి
ద్రవిణమ్ము సహాయులుంట ♦ తగుఁ జుమ్మెపుడున్. 32
వరగుణుఁడగు దైవజ్ఞుం
దరిసించి ముహూర్త మడిగి ♦ తత్పరమతులై
పరిణయమునకుం బోలెం
బరికల్పింపంగ వలెన♦వారిగ ధనమున్. 33
జగతి నాషాఢంబు ♦ శ్రావణ భాద్రప
దాశ్వీన కార్తిక♦ కార్గశీర్ష
ణికములు వినెడి వా♦రికి ముక్తి సూచించుఁ
గాన సప్తాహ మీ ♦ కాలమందు
మొదలిడవలె నన్య♦ములు గూడ వెల్లరు
తోడ్పడ వలయును ♦ దోఁచినట్లు
దేశ దేశములకీ ♦ దివ్య వార్తను బంప
వలె నెన్ని జతనముల్ ♦ సలిపియైన
హరికథలను గాని ♦ హరిని గీర్తించుట
గాని యెఱుఁగనట్టి ♦ గఱితలకును
శూద్రులకును మదులఁ ♦ జొచ్చెడునట్లు బో
ధింప వలయుఁ గథల ♦ నింపుగాను. 34

మఱియు నానాదేశములందున్న వైరాగ్యసంపన్నులైన వైష్ణవాగ్రేసరులఁ గీర్తనోత్సుకుల లేఖలంబంపి పిలిపింపవలయు.

## * ఆహ్వానము *

శ్రీ భాగవతము వి♦శేషార్థ సహితంబు
గా నిట నొక్క మ♦హాను భావుఁ
డెజ్జిఁగించు మిక్కిలి ♦ యింపుగా సొంపుగా
సనఁటిపం డొల్చి పె♦ట్టిన విధాన
నేడు రోజులలోన ♦ నిచ్చటఁ బండ్రెండు
స్కంధముల్ పూర్తిగాఁ ♦ జదువఁ బడును
సజ్జను లెందఱో ♦ చనుదెంతు రట్టి స
త్సభలు దుర్లభములు ♦ జనములార !
ఎప్పుడున్నదే జంజాట ♦ మెట్టులైన
వీలు కలిగించుకొని రండు ♦ వినుఁడు వసతు
లేర్పఱుపఁబడు భోజనం ♦ బిడఁగఁ బడును
రండు రండయ్య జనులార! ♦ రండు రండు. 36

భాగవతంబిటఁ ♦ బఠియింపఁగాఁబడు
నాలింప రారయ్య ♦ బాలురార!
వరకథామృత మిటఁ♦బంచెర మొనరింత్రు
జుఱ్ఱుకొనఁగ రండు ♦ వెఱ్ఱులార!
సప్తాహ యజ్ఞ మి♦చ్చట జరుగుఁదదీయ
ధూమ్యఁదోఁగఁగ రండు ♦ సౌమ్యులార!
శుకశాస్త్ర సౌరభ♦స్ఫూర్తి దెసలఁ బ్రాఁకు
ఘ్రాణతృప్తికిరండు ♦ ప్రాణులార!
సదవకాశము రారండు ♦ వదలఁబోకుఁ
డొక్క దినమైన రండు లే♦కున్న నొక్క

పూటమైనను సకుటుంబ ♦ ముగను రండు
చివర కొకసారి తొంగి చూ ♦ చి చనుఁడయ్య! 37

## * పరస్థలము *

అని కరపత్రంబుల ద్వారమునఁ బ్రకటించి యాగంతుకులకుచిత వాసస్థానభోజనాదులు కల్పింపవలయును. తీర్థములందేని వనములందేని భవనములందేని విశాలప్రదేశంబుచూచి సప్తాహ యజ్ఞస్థలము నిర్ణయించుకొనవలె సాధారణముగా గృహస్థులు గ్రామమందే యేర్పఱుచుకొనవలె. 38

భాగవతంబును ♦ బఠియించు నెలవునం
గల గృహోపస్కరం ♦ బులఁ దలంగి
మొకమూల వేయించి ♦ యూడ్పించి నీరంబు
చల్లించి యలికించి ♦ యుల్లసిలుచు
రఁగవల్లులఁ గను ♦ రంగుగాఁ దీర్పించి
పూర్తిగాఁ గంబళం ♦ బులను బఱచి
మఱి కదళీఖండ ♦ మండితంబగు మండ
పం బెత్తుగా నేరు ♦ పఱచి యందు
దళములం బూలఁ బండ్ల వి ♦ తానములను
గట్టి నలుదెసల ధ్వజంబు ♦ లుట్టిపడఁగఁ
జేసి పైసప్తలోక సం ♦ వాసులకు స
విస్తరంబుగఁ దావుఁగ ♦ ల్పింప వలయు.

పలువురకుం గనిపించెడి
నెలవున నున్నతపుఁ బీఠ ♦ నెలకొలుపంగా

వలె నా దివ్యాసనమునఁ
వెలుఁగుచుఁ బౌరాణికుఁడు వ♦సింపఁగ వలయున్. 40

## * వక్తృవిషయము *

త్వరపడఁబోక వర్ణములు ♦ స్పష్టముగా వినిపింప మాధురీ
స్వరమున వాక్యభేదముల ♦ భ్రాంతి దగన్ బదభాగమొప్ప న
క్షర లయు తప్పకుండ హరి ♦ గర్జిలునట్టి విధంబునన్ ధృతి
స్ఫురణఁ బఠించువాని బుధ♦పూజితుఁ బాఠకుఁడండ్రు కోవిదుల్.

అల్పకంఠుఁ డనర్థజ్ఞుఁ♦డధిక వేగ
మునగనో? వర్ణవర్ణముకడ ♦ మూల్గుచునో? శి
రంబు ద్రిప్పుచుఁ జదువును ♦ వ్రాఁత దోసఁగు
నరసి చదువనేరఁడు పాఠ♦కాధముండు. 42

ఇది యెఱిఁగి వేదశాస్త్రముల్ ♦ చదివి యున్న
వాని దృష్టాంత కుశలు స♦ద్వైష్ణవుని వి
రక్తు విప్రుని శాంతుఁగా♦ర్యజ్ఞు ధీరు
వక్తగా వరియింపఁగా ♦ వలయు నెపుడు. 43

బహుళ ధర్మాళిఁ జిక్కి వి♦భ్రాంతులగుచుఁ
బథమెఱుఁగక పాషండ ♦ వాదినులయి
యుండ్రు గాన భాగవతోక్తి ♦ కువిద లెపుడు
వనికిరా రెంత పాండితి ♦ వరలుచున్న. 44

పౌరాణికు దండ నొకఁడు
ధీరుం డంతటి బుధుండు ♦ దృఢసంశయ సం
హారుఁడు లోకజ్ఞుఁడు వి
చారమణుం డుండవలె స♦హాయుండగుచున్. 45

వక్త్ర ప్రతాప్తి క♦ర్వాగ్ధినంబున ముండ
సంబు సేయించి కొ♦నంగ వలయుఁ
గథ చెప్పునాఁ డుషః♦కాలంబునఁ స్నాన
ముం జేసి సంక్షేప♦ముగను నిత్య
విధుల సంధ్యాదిఁగా♦వించి పితాళ్ళకుఁ
దిలజలంబిడి విశు♦ద్ధికగు పాచి
తం బొనర్చుకొని క♦థావిఘ్నశాంతికి
శ్రీ గణనాథుఁ బూ♦జింప వలయు

అవల స్థాపించి మండల♦మందుఁ గృష్ణు
మంత్రముల యథావిధి సక్ర♦మముగఁ బూజ
లాచరించి భక్తిశ్రద్ధ ♦ లలము కొనఁగ
దేవు వలగొని మ్రొక్కి స్తు♦తింప వలయు. 46

ఇల్లను కారుచీఁకటి ను♦యింబడితిన్ గుదెబండ నొక్కటె
న్మెల్లఁగఁ గట్టికొంటి నటు ♦ మీఁద జలూకలువోలెఁ బుట్టిరీ
పిల్లలు జెల్ల లేపగిది ♦ వీని దరిం బడవైచి పేర్మి రా
జిల్లఁగ గాతువో శరణు♦శ్రీరమణీ హృదయాబ్జ భాస్కరా! 47

కొడుకునుఁగోడలున్మసలి♦కుక్క! యటంబడి యుండుమంచుఁ ది
ట్టెడునెడఁగూడ నెమ్మదిఘ♦టిల్లిన పుత్త్రవిమోహ మింతయుం
గడచినదాయె సంస్మృతిని ♦ గల్గకపోయె విరాగ మట్టియీ
జడునిఁ గృపామృతం బొలికి♦సాఁకవె శ్రీరమణీ మనోహరా! 48

ఎన్ని జనుశ్శతంబుల వ♦ఝుం జననంబయి చుట్టుముట్టె వెం
టన్నడ తెంచుచున్నదో హు♦టాహుటి మోహవిపాశ మద్దియు

ష్మన్నయ నాంచలం బిటు ప్ర♦సారము గాక క్షణంబులోన వి
చ్ఛిన్నముగాదు భక్తతతిఁ♦జేరిచి నన్దయఁజూడు మాధవా! 49

ఆపదవచ్చినప్పుడు ద♦యామయా! నీశరణంబు చొచ్చితిం
బాపర దీనినంచు బహు♦భంగుల వేఁడితి దానిదాఁటి నీ
ప్రాపును వీడి నీ స్మరణఁ♦బాసి కృతఘ్నుఁడ నైతి నయ్యయో
పాపిని నన్ క్షమించి కృపఁ♦బాలనసేయర భక్తపోషకా! 50

కర్మము లున్నఁగాని పొడ♦కట్టదు దేహము, దేహమున్న నే
కర్మము లాచరించుట యు♦గంబెటులంటునో? నాకుఁ జిత్రమం
తర్మనుఁడన్ మతేశుగడ♦నాకిఁక నెవ్వరులేరు నీవ యీ
కర్మము దేహ మీపయిని♦గల్గక యుండఁగఁ జేసి ప్రోవరా! 51

ఇమ్మెయి దేవదేవు నుతి♦యించి యనంతర మల్ల శౌకశా
స్త్రమ్ము యథావిధానముగ♦శ్రద్ధగ సాత్త్విత పుష్ప ధూప దీ
పమ్ము లొసంగఁ బూజ సలు♦పన్వలె నావల శ్రీఫలమ్ము హ
స్తమ్మునఁదాల్చి ప్రొక్కి ప్రము♦దమ్మున స్తోత్ర మొనర్పఁగావలెన్

అక్షర రూప మొంది సక♦లార్థి జనావళి నుద్ధరింపఁ బ్ర
త్యక్షమవైన కృష్ణ పర♦మాత్మవు భాగవతమ్మ! గ్రంధమా!
ఈక్షితి నిన్నుఁబోలఁ గల♦దెయ్యది లేదు మదీయ సర్వపా
పక్షయముం బొనర్పుమని♦పట్టితి నిన్నుఁ గరద్వయంబునన్. 53

ఏదయినం బ్రమాదమున♦నే నొక శ్లోకము దాఁటిపోవు నే
మో! దళితార్థముం దొలఁగి♦పోవునొ పెద్దలమార్గ? మట్టిచో
సాదృతిఁ జూచుచుండఁగదె♦యమ్మ! పురాణవతంసమా! భవ
త్పాదములంటి మ్రొక్కి నిను♦బట్టితి చేత ననుగ్రహింపుమా! 54

ప్రారంభించితి గ్రంథముఁ జదివి తాత్పర్యాదులందెల్ల నీ
కారుణ్యామృతవృష్టి నావఁ గని జిల్కంగావలెన్, విఘ్నముల్
దూరంబందె తొలంగఁజేయవలె, నేదోషంబు లేకుండ నా
పై, రక్షింపవె దాసదాసుఁడను దేవా! విశ్వ విశ్వంభరా! 55

## * యజ్ఞకర్త్ర విషయము *

అని వక్త పురాణ కృష్ణులకు నమస్కరించి కూర్చుం
డఁగా సప్తాహ యజ్ఞ కర్త వినయంబున వక్తను బూజించి
వస్త్రభూషణాదుల నలంకరించి. 56

స్వామి! బుధాగ్రణీ! సకల శాస్త్రవిశారద! బోధకత్వ వి
ద్యామహిత ప్రభావనిధి! వ్యాససుత ప్రతిరూప! యంబుభృత్
శ్యామల గాత్రు నుజ్జ్వల కథాసమరత్నముల న్వెలార్చి చే
తో మలినాంధకారమును దూరముచేయఁగదయ్య మ్రొక్కెదన్

అనుచు నమస్కరించి వినయంబున వక్త సమీపమంద యుం
డి నియమవంతుఁడై వినుచు నిత్యము వానికి భోజనాదులం
బనుపరియై ఘటించుచును వక్తను వేయివిలోకనంబులం
గనుఁగొను చుండఁగావలయుఁగా దినసప్తకము న్ముదంబునన్

మఱియుఁ గథాంతరాయములు మానుటకై వరియించి వంచభూ
సురులను ద్వాదశాక్షర విశుద్ధ జపంబులు వారిచే ధృతిం
జరుపఁగఁ జేయుచుండనగు సప్తదినంబులు మంత్రవశ్య లి
ద్ధరణిని దైవతాగ్రణులు తద్ద్విజ వశ్యము మంత్రమారయన్ 59
మఱియుం గర్తవినయ త
త్పరుఁడై భూసురుల వైష్ణవ శ్రేష్ఠుల నా

దరమునఁ బూజించి నమ
స్కరించి మొదలఁగొని వినఁగఁ♦జను గ్రంథంబుఁ. 60

వైరాగ్య సంపన్నులైన వైష్ణవుల వక్త కెదురుగాఁ
గూర్చుండఁ బెట్టి తాఁ గూర్చుండవలయు. 61

వక్త యుత్తరముఖుఁడైనఁ ♦ ప్రాఙ్ముఖుండు
శ్రోతగావలె వక్త తూ♦ర్పు మొగమైన
నపుడు శ్రోత యుదఙ్ముఖుం♦డగుట లెస్స
యుభయులకు దెస పట్టింపు ♦ లున్న యెడల. 62

అయ్యదియుఁగాక నొక రహ♦స్యంబు వినుము
దేశకాలాది కోవిదుల్ ♦ దివిరి పూజ్య
పూజకుల మధ్యమున నెప్పు ♦ పూర్వదిశ యె
యింద్రు వారెట్టులుపవిష్టు♦లైనఁ గూడ. 63

## ✻ శ్రోతల విషయము ✻

ఎవరిని జూడరా దెవరి ♦ నేవిధిఁ బ్రశ్నల వేయరాద యిం
టివాఁ? తనవోఁ?కుమారులవా?♦నెత్తవో?లోకములోనివోఁ? మత్తే
రివోఁ? విషయంబుల స్మదిస్మ♦రింపఁగరాదు వచింపరాదు వ
క్తవయిపుచూచుచు న్వినఁగఁ ♦ గల్గుఫలంబధికంబుశ్రోతకుఁ.

ఎల్లిపైఁ బిల్లిపడెనని ♦ పిల్లి పయిని
నెల్లి పడెనని యెటలేని ♦ వెల్ల నిటనె
త్రవ్విపోయుదుర్ రద్దికి ♦ రంగమునకు
రాని ముచ్చటలెల్లఁ బు♦రాణమందె. 65

కొడుకులఁ దిట్టిపోయుటలు ♦ గోడలి నాఱడి పెట్టుచుండుటల్
కుడుపున వ్యంజనంబులను♦గూర్చి చర్చలు చేయుచుండుటల్
గడుసరి దాసి నెన్నుటలు ♦ కానివి యైనవి యెల్లసంగతుల్
గుడగుడ వాగుచుండుటలు♦కోమలులే సభలోన నెప్పుడున్. 66

గల గల వాగుచు వినర
న్యులనా? విననీయ, రేటి♦కో పీరటకుం
గులుకుచు వచ్చెద రయ్యా!
ఫలము వలుకు దేవుఁడెఱుఁగుఁ ♦ బాపము వచ్చున్. 67

ఇతరులురా స్థలంబొసఁగు ♦ చెవ్వరు నోరు మెదల్చిన న్నమ
స్కృతుల నెమాన్చుచుం బలుకి ♦ కెవ్వడువ క్తముఖంబునూచుచున్
మతిఁ గత పైని బెట్టి విను ♦ మానిసి కబ్బు ఫలంబు నెన్నఁగా
శతధృతి చాలఁడేల పలు♦సారులు దీనిని గూర్చి చెప్పఁగన్. 68

వెనుకఁ జనుదెంచు వారలు
వెనుకనె కూర్చుండ వలయు ♦ విగత రవముగాఁ
జనదు మును కూరుచుండిన
జనము న్నెట్టుకొని ముందు ♦ చనుట సభలలో. 69

## ✻ పురాణ పఠనకాలము ✻

భాస్కరోదయ మాదిగా ♦ భాగవతము
చదువఁ బూని మూఁడున్నర ♦ జాలు చదువ
నగు గభీర కంఠమున, మ♦ధ్యాహ్నమందు
గడియ లొకరెండు విశ్రాంతి♦పడయ వలయు. 70

అవర సంధ్య యగుడు♦నాపి పురాణము
నామకీర్తనం బొ♦నర్ప వలయు

వైష్ణవా గ్రసరులు ♦ ప్రారంభ మొనరింప
నిత్య మధికభ క్తి ♦ నివ్వటిల్ల 71

* కథావ్రతుని నియమములు *

కథ వినఁగోరిక♦కలవాఁడు భుజియింప
నగు నొక్కమఱి హవి♦ష్యాన్న మెలమి;
మల మూత్ర జయమును ♦ గలిగించుఁ గాన ల
ఘ్వాహార మెపుడు సు♦ఖావహమ్ము;
శ క్తి గల్గినవాఁడు ♦ స ప్త రా త్రమ్ములు
నుపవసించియె విను♦చుండ వచ్చు;
నది గానియెడలఁ బ♦యః పానమేని స
ర్పిష్పానమే నొన♦ర్చి వినవచ్చు;
పండ్లు తినియైన మఱియొక్క♦పరి భుజించి
యైన నేది సుఖమొ యట్టు♦లగు నొనర్పఁ;
గథ వినఁగ విఘ్న మొక్క ప్డు ♦ కలుగవచ్చుఁ
గనుకఁ బస్తుంట కన్న భో♦జనమె మేలు; 72

అవనీ జనులకు స♦ప్తాహ వ్రతులకు నే
మమ్ముల వినవయ్య ♦ మౌని వర్య !
కథ విన విష్ణు దీ♦క్షా విహీనుల కధి
కార మేమాత్రంబు ♦ గలుగఁ బోదు
బ్రహ్మచర్యము క్రిందఁ ♦ బండుట కథ విన్న
యువల వి స్తరికుడు ♦ పివి వలయును ;
తైలంబు మధువు ద్వి♦దళమును గూడవు
భావ దుష్టమ్మును ♦ బర్యుషితముఁ

గడు గరిష్ఠమగా నన్నంబుఁ ♦ గుడువఁ జనదు,
వ్యాజమానమ్ములను లోన ♦ వరలు చున్న
శత్రువుల నార్గురం జంపి ♦ శాంత చిత్తుఁ
డై పురాణము విననగు ♦ ననుదినంబు. 73

గురువుల గోవ్రతులను భూ
సురులను వైష్ణవవరులను ♦ శ్రుతులను స్త్రీలన్
ధరణీ నాయకుల మహా
పురుషుల నిందింపరాదు ♦ పో కథవినుచున్. 74

పతితులను బ్రాత్యులను రజ♦స్వలల నంత్య
జాతులను మ్లేచ్ఛులను ద్విజ ♦ శత్రువులను
వేదబాహ్యులం గనుఁగొని ♦ విముఖుఁడగుట
తగును మాటాడరాదు క♦థా వ్రతుండు. 75

వినయం బుదార మానస
మును ఋజుభావంబు మౌన♦మును దయ శౌచం
బును సత్యము నెల్లప్పుడు
దనరారంగ వినవలెఁ గ♦థావ్రతి యనఘా! 76

ఇట్టి నియమముల వ♦హించి యీ కథ విన్న
వాని ఫలము చెప్ప ♦ వలయునయ్య!
కోటి యజ్ఞ ఫలము ♦ గోటికిఁ జాల దిం
కేటి కనఘ చరిత! ♦ మాటలాడ. 77

అన వత్యుఁడు మోక్షార్థియు
ఘనపాపాత్ముండు రోగ ♦ కలితుండును సి

ర్ధనియు దురదృష్టుఁడును ఋణియు
వినినన్ వాంఛితము లబ్ధ ♦ మిడి నెఱవేఱున్. 78

కడుపులు పోయెడు నదియుం
గొడుకులు లేనిదియు నొక్క ♦ కొడుకున్నది చ
చ్చెడు పిల్లలు గలదియు నే
ప్పుడు పుష్పింపనిది విన్నఁ ♦ బోవుఁ గొఱంతల్. 79

* పురాణ శ్రవణానంతర కర్తవ్యము *

ఈపయి నేమముల్ దగ వ♦హించి కథన్విని యేడునాళ్ళులు
ద్యాపనము న్మునీంద్ర! జన♦నాష్టమి నాటి వ్రతంబువోలెఁ దా
నోపికఁ జేయఁగానగు స♦ముత్తమమైన ఫలంబు దానిచేఁ
జేపడుఁ జేసి నమ్మకము ♦ జేసిన యంత యటుందు రేకదా. 80

శక్తిలేని భక్త♦చంద్రముఖకును ను
ద్యాపనమున సాగ్ర♦హంబు లేదు
శ్రవణ మాత్రముననె ♦ ప్రయతుఁడౌ; నిష్కాముఁ
డైన వైష్ణవుని వి♦ధాన మనఘ! 81

అసమము నగాహాసవన
మ్మసమాప్తముగాఁగ శ్రోత ♦ పుష్కలభక్తి
ప్రసృమర మనస్కుఁడై య
ర్చసేయవలె వక్తకుం బు♦రాణంబునకున్. 82

తులసీ ప్రసాదమును శ్రో
తలకొసఁగంగవలె శంఖ ♦ తాళ మృదంగో
ల్లలితమగు నామ కీర్తన
మలరుచుఁ జేయవలె జయ జ♦యారావముతో. 33

దినసప్తకంబు భ♦క్తిమెయి గ్రంథమును ము
ఖ్య శ్రోతవిని విర♦క్త మతియైన
చో మఱునాఁడు వి♦శుద్ధుఁడై గీతను
బఠియించినం జాలు ♦ వరలుశాంతి;
గేస్తట్లు గాదు ప్ర♦శస్తిగా హోమంబు
సలుపంగవలెఁ గర్మ ♦ శాంతి కొఱకు;
మహిత విధిని దశ♦మస్థ ప్రతిశ్లోక
మును వేల్వవలె మధు♦వును ఘృతంబు

పాయసము తిలాన్నాదిక ♦ పరివృతముగ;
నదియుఁగాదో? గాయత్రితో ♦ హవనమాచ
రింపవలె నిజమును విచా♦రింపఁ దన్మ
యమ్ము కాదలె భాగవ♦తమ్మదెల్ల. 84

హోమ కార్యంబు చే♦యుట కశక్తుండైనఁ
గొలఁది గొప్పలు ఛిద్ర♦ములు దలంగ
హోమ్యాం బొసంగఁగా ♦ నగు ఫలసిద్ధికై
యదిగాక దోష ప్ర♦హాణమునకుఁ
జదువంగ వలె నామ ♦ సాహస్రకముదాన
సకలమ్ము సఫలమౌ ♦ సన్మునీంద్ర!
స్కంధమ్మునకును నొ♦క్కండుగా ద్వాదశ
బ్రాహ్మణ వరులకు ♦ భక్తితోడ

భక్ష్యభోజ్య చోష్య ♦ పానీయ సహిత మృ
ష్టాన్న మొసఁగి ధేను♦వైన హేమ

మైన విత్తమైన ♦ నర్పించి వ్రతమును
బూర్తిచేసికొనఁగఁ ♦ బోలునయ్య! 85

శక్తిగల్గిన ధన♦శాలి పలత్రయ
మితహేమ హారిని ని♦ర్మిత మొనర్చి
రమ్యాక్షరములతో ♦ వ్రాసిన భాగవ
త గ్రంథము పయిని ♦ దాని నిల్పి
సద్గుణుండైన యా♦చార్యు నావాహనా
ద్యుపచారములఁ బూజ♦లొనర సలిపి
వలగొని మ్రొక్కి ని♦ర్మల వస్త్రభూషణ
గంధాను లేపన ♦ కలితుఁ జేసి
దక్షిణలతోడఁ గనక హా♦ర్యత్న సహిత
పుస్తకము దాన మొనరించు ♦ పురుషవరుఁడు
బహుళ పాపంబులను భవ♦బంధములను
బాసి ముక్తిని బొందు ట♦ప్రబంబటయ్య! 86

జగతి ధర్మార్థ కామ మో♦క్షములు నాల్గు
పడయుటకు సాధనంబు శ్రీ ♦ భాగవతము
ఘన శుభములీయ దీని మిం♦చినది లేదు
లేదయా సంశయం బేమి ♦ లేదు లేదు. 87

అని సనత్కుమారాదులు నారదునికిం జెప్పి యయ్యా! భాగవతము వలననే భుక్తి ముక్తులు కరతలామలకంబులగును. నీకు సర్వము వినిపించితి మిం కేమి వినవలతువని యడిగిరంచు సూతుండు శౌనకాదులకుం జెప్పి వెండియు నిట్లనియె. అట్లు

భాగవత మహిమ నువివి పరక మహర్షులు భుక్తి ముక్తి ప్రదాయకము సర్వ పాప ప్రహారకమునగు భాగవతము నేడు దినంబులలో విన్పింప వారెల్లరుం బ్రహృష్ట చిత్తులై పురుషోత్తముని సంస్తుతించిరి. సప్తాహాంతమున భక్తి జ్ఞాన వైరాగ్యులు పరిపుష్టి నొంది పరమ తారుణ్య సంపన్నులై మహోల్లాసంబునం దాండవించిరి. 88

అప్పుడు నారదముని మెయిఁ
గప్పం బులకతతి యెసఁగ ♦ గప్ప ముదము, కన్
గప్ప ముదశ్రులు, గళముం
గప్పఁగ గాద్గద్య, మీ ప్రకారము పలికెన్. 89

మునివరులారా! మీచే
ననుగ్రహింపఁబడితిం గృతార్థుఁడనైతిన్
ఘనసర్వపాపహరణుఁడు
జనార్దనుఁడు శౌరి మద్వశంగతుఁడయ్యెన్. 90

వైకుంఠపురస్థుఁడగు
శ్రీకృష్ణుఁడు శ్రవణముననె ♦ చేపడుఁగాన
లోకమున సర్వధర్మా
నీకములో శ్రవణమె గణనీయము తలపన్. 91

అని వైష్ణవోత్తముఁడైన నారదభగవానుండు ప్రీతుఁడై పలుకుచుండ 92

## * శ్రీ శుకయోగీంద్రుల సమాగమము *

నేత్రాంచలంబులు ♦ నిండితోల్కాడెడు
ప్రేమామృతంబు వ♦ర్షించుచుండ
బహువిశాలంబైన ♦ ఫాలభాగమునుండి
బ్రహ్మతేజం బుట్టి♦పడుచునుండ
అప్రయత్నముగ జి♦హ్వా పల్లవాగ్రంబు
శ్రీ భాగవత ముచ్చ♦రించు చుండ
నూఁగు నూఁగుగ మూతి♦పైఁ గునిసెడి మీస
లెలప్రాయపుం దళ్కు ♦ లీనుచుండ
మొలను గ్రమ్మి కావి ♦ పుట్టగోచి వెలుంగఁ
గెంజడలు శిరంబు♦నం జెలంగఁ
గోటి సూర్యకాంతి ♦ గోళగర్భంబున
శుకమహర్షి పొడవు ♦ సూపె నపుడు. 93

జ్ఞాన మహాబ్ధి చంద్రముఁడు♦సంయమివర్యుఁడు వ్యాసమౌనిసం
తానము షోడశాబ్దములు ♦ దాఁటని యోగి శుకర్షి రా సము
త్థానముఖోచితార్చల య♦థావిధి సల్పి నమస్కరించె వి
ద్యానిధులున్న తత్సభ, య♦నంతర మాశుకమౌని యిట్లనెఁ 94
ఆగమామరద్రువునందు ♦ మాఁగఁ బండి
శుకముఖమ్మున రాలి త♦త్సుధను దేలి
భాగవత ఫలమ్మిదె చిక్కెఁ ♦ బట్టు విడక
త్రావుఁడా! తద్రసముసారె ♦ రసికులార! 95
పరపుస్తంబు లవేల? భాగవత ము♦ద్భాసింప నిర్వ్యాజమా
పరధర్మంబిది తెల్పు వస్తువౌ త్రితా♦పచ్ఛేది మేలిచ్చుచు

త్సరశూన్యాళికె దీనివాస్తవము వే♦ద్యంబౌ, నిమేషాన నీ
శ్వరు బంధింపరె దీనివిన్న సుకృతుల్ ♦ స్వాంతంబునన్నారదా.

భువిలో వైష్ణవ పాళి మూలధనమీ ♦ పుస్నెంపుఁబోత్తమ్ము శ
స్త్రవిధిం బారమహంస్యమైన విమల ♦ జ్ఞానమ్ముఁ గీర్తించు, జ్ఞా
నవిరాగ స్థిరభక్తి సమ్మిళితమా ♦ నైష్కర్మ్యముం దెల్పు, దీ
నివిచారించి పఠించిన న్వినిన వా♦నిన్ముక్తి పెండ్లాడెడిన్. 97

నాకమందుఁ గైలాసంబు ♦ నందు సత్య
మందు వైకుంఠమందు లే♦దయ్య యిట్టి
రసము తనివు దీఱంగను ♦ ద్రావుఁడయ్య
వదల వలదించుకియు భాగ్య ♦ వంతులార! 98

అని శ్రీ బాదరాయణి గ్రంథప్రశంస చేయుచుండ. 99

* భగవానుఁడు ప్రత్యక్షమగుట *

చదలుపై నెచటనో ♦ చాల దవ్వగఁ గర్ల
పరవఁ జొచ్చె దెసలఁ ♦ దఱిమినట్టు
లంతలో మృదు శార♦దాబ్దంబునా వెల్ల
నగు వెలుంగుం గుమి ♦ యచటఁ దోఁచె
నంతలో నొకరిక్క ♦ యవనిపైఁ బడుచున్న
యట్లు తళుక్కన ♦ నలమెఁ గాంతి
యంతలో బహుకోటు ♦ లాదిత్య మండలం
బులు ధరఁ బడుచున్న ♦ పోల్కి నుండె.

అంతలో గరుడారూఢుఁ♦డైన విభుఁడు
ఫాల్గునోద్ధవ ప్రహ్లాద ♦ బలి ముఖాత్మ

భక్తజన పరీవృతుఁడై స♦భాస్థలమున
నుట్టిపడియెఁ గన్నులు మిఱు♦మిట్టులు గొన. 100

సనకాది మునిచతు ♦ ష్టయ మొంపారులు నెట్టు
కొనుచు లేచిరి నింగిఁ ♦ గనుచునుండి
తన మహాతీ విపం♦చిని దంతితెగఁ ద్రొక్క
చున లేచె మెడ యెత్తు ♦ కొని సురర్షి
గాలిపటము రీతి♦గా జెప్పుమని లేచె
జోడించి చేతులు ♦ శుకమహర్షి
జయజయా రావంబు ♦ సలుపుచు భృగుముఖ్య
సంయముల్ లేచిరి ♦ సదుదుకొనుచు

ఇంకఁ గొందఱు కనుఱెప్ప ♦ లెత్తరైరి
యింకఁ గొందఱే మిదియని ♦ యెత్తిరి తల
లింకఁ గొందఱు వా విచ్చి ♦ రెటులొ కనుచు
సభఁ గలకలధ్వనుల్ పుట్టె ♦ క్షణములోన. 101

చదువుటలోన దొ♦సంగేదితూ వచ్చి
యడిచెరా నెత్తి యం♦చనియె నొక్క
డంత గ్రంథమునకు ♦ శాంతిచేయక యున్న
నట్టిట్టు గాదురా ♦ యనియె నొక్కఁ
డిన్నిరోజుల నుండి ♦ యీశు పేరెత్తరై
రతఁడు కోపింపఁడా? ♦ యనియె నొకఁడు
శ్రుతుల మించెను భాగ♦వతమన్న యపచార
మంతంబు సూపదే ♦ యనియె నొకఁడు

ఒకఁడు పఱచెఁగమండ లూ♦దకము చింద
నొకఁడు దూఁకె మృగాజిన ♦ మాడుచుండ
నొకఁడు దండమున్యునికిఁ గొ♦ట్టుకొన నడిచె
సభఁ గలకలధ్వనుల్ పుట్టె ♦ క్షణములోన. 102

అంత నారదముని యొక్క ♦ గంతువైచి
హరిపదాంభోరుహములకు ♦ నధికభక్తిఁ
బూజలొనరించి యానంద♦మునను నృత్య
మాడఁజొచ్చెను బరవశుం♦డౌచుమింట. 103

అంత బ్రహ్మాదిదేవత లాకసంబున నిలిచి చూచుచుండఁగా. 104

* కాయాధవుఁడు తాళ♦గతి చూపుచుండంగ
నుద్ధవాఖ్యుఁడు కాంశ్య♦మూనుచుండ
నారదముని మహా♦తీరావ మొలయింప
దైవతాధిపతి మృ♦దంగమంద
నర్జునుండు స్వరంబు♦లంది రాగముదీయ
మఱి సనకాది కు♦మారకులును
జయజయధ్వాన మి♦శ్రముగఁ గీర్తనపాడ
సురుచిర రచనలు ♦ శోభిలంగ
వ్యాసనందనుండు ♦ స్వామి సన్నిధియందు
భావమెల్ల విశద♦పఱచి నుడువ
నానడుమను భక్తి♦జ్ఞాన విరాగులఁ
గూడి మిత్రుల నృత్య♦మాడఁజొచ్చె. 105

* కాయాధవుఁడు = ప్రహ్లాదుఁడు.

తరువోజ॥ జయజయ క్రూర ని♦శాట సంహార!
జయజయ నీరద ♦ శ్యామలాకార!
జయజయ కౌస్తుభాం♦చత్పృథువక్ష!
జయజయ మందహా♦సస్ఫుటవీక్ష!
జయజయ భక్త ర♦క్షాకేళిలోల!
జయజయ వేదాంత ♦ సంచారశీల!
జయజయ కరుణా ప్ర♦సన్నాస్యపద్మ!
జయజయ వైకుంఠ ♦ సత్పురసద్మ! 106

అని యీ ప్రకారంబున బృంద గానంబొనరింప శ్రీహరి ప్రసాదమేదురావలోకనంబులు వోలయఁ గుమారులారా! సంప్రీతుండనైతి. అభీష్టంబు గోరుకొనుఁడన సనకాదు లొౕదలఁ గేలు పాదుకొల్పి దామోదరా! "సప్తాహంబులఁ దమరిట్లు ప్రసన్నులరు గావలయు"నన వల్లెయని స్వామి తిరోహితుం డయ్యె. 107

అంతట నారదుండు సన♦కాదుల పాదములంటి మ్రొక్కి యా చెంత నెయున్న వ్యాససుతు ♦ చిన్నిపదంబుల వ్రాలి తక్కు ధీ మంతుల మానులం గొలిచి ♦ మన్ననలం బొనరించి శంసల త్యంత మొనర్చె నేరయిన♦సంత్యమునం బ్రియమాడఁగావలెౕ,

అంత నెల్లరు నానందమున నామకీర్తన మొనర్చుచుఁ దమతమ యిరవుల కరిగిరి, అని సూతుండు చెప్పి మఱియు నిట్లనియె, 109

శుకముని నాయకుండు తన ♦ చొక్కపు భాగవతంబునందు భ క్తికి మఱి యామె పుత్రులకు♦ గేహములిచ్చి యనుగ్రహించి ర

తుష్టుఁడయి మించెఁగావున నె♦కాంచనచేలుఁడు తత్పురాణ సే
వకులగు వైష్ణవోత్తముల♦స్వాంతములం జొరఁబాఱివెల్గెడిన్.

దైన్యదారిద్ర్య రుగ్వహ్ని ♦ దాహితులను
మాయికోగ్ర పిశాచికా ♦ మర్దితులను
బహుళ సంసార వార్ధి ని♦పాతితులను
గాతునని భాగవత మడే ♦ గర్జిలెడిని. 111

**సూతుండు భాగవత సప్తాహము లెపుడు జరిగినది చెప్పుట.**

అని సూతుండన శౌనకుం డడిగె దే♦వా! దేవరాతుంగనుం
గొని వ్యాసాత్మజుఁ డెప్పుడీని నుడివెన్? ♦ గోకర్ణుఁడేనాఁడు దీ
నిని విన్పించెను ధుంధుకారి, కవలన్ ♦ శ్రీ నారదుండు న్వినన్
సనకాదుల్ వినిపించి రెప్పుడిది ♦ నా సందేహముందీర్పవే! 112

అనిన సూత పౌరాణికుం డిట్లనియె. 113

హరిచన్న ముప్ప దేండ్లకు
పరసంబగు భాగవతము ♦ శ్రావణ నవమిన్
దొరఁకొని శ్రీ శుకమహాసి
శ్వరుఁడు పరీక్షిన్నృపాల ♦ వరునకు నుడివెన్. 114

ఆవిభుఁ డరిగిన సీకలి
లోవర్షశతద్వయంబు ♦ లోఁగ ననుజుఁ డెం
తేవిన గోకర్ణుండు
న్యావిరి నాషాఢ శుద్ధ ♦ నవమి వచించెన్. 115

అప్పాఱుఁడు చన్నపిదప
ముప్పది యేండ్లకును బ్రహ్మ ♦ పుత్రులు దీనిం

జెప్పిరి నారదున కొగి
న్దప్పక కార్తికక శుద్ధ ♦ నవమి మొదలుగన్. 116

శౌనక మునీంద్రా! నీ యడిగినది నుడివితి, కలిలో
భవరోగ వినాశిని భాగవత వార్తయే. 117

కలుష సమూహ మెక్కువరి ♦ కాలిచి వేయును భక్తిదేవి లీ
ల లనుభవింపఁజేయుఁ, గమ♦లావతికిం బ్రియమైన, దింకఁ గే
వలతను గూడనిచ్చు, ధర♦వర్తిలునో జనులార! తీర్థయా
త్రల కనియేల ద్రిమ్మరఁగఁ♦ద్రావుఁడ భాగవతామృతాంబువుల్.

తనభటు లుగ్రపాశములు ♦ దాలిచి నేలకు డిగ్గుచుండఁగాఁ
గని యముఁ డిట్లుపల్కునఁట ♦ క్రన్నన వారలకర్ణమూల మం
దనయము మీరుపోవలద ♦ యచ్యుత గాథలవించు మత్తు లా
ననఘులచెంత కేఁ బ్రభుఁడ ♦ నయ్యుతదన్యుల కే యటంచొగిన్.

సారమ్ము లేని సం♦సారమ్ము నందు దు
ర్విషయ విషం బెక్కి ♦ వికల చిత్తు
లైన యో లోకు లా♦రా! క్షణార్ధంబైన
క్షేమార్థమై యిదే ♦ శ్రీశుకోక్త
గాథామృత రసంబు ♦ కడుపుల నిండఁ ద్రా
వరయా యిటేల కా♦పథము పట్టి
కుత్సిత గాథల ♦ కొఱకుఁ బోయెదరు కా
లమ్మెల్ల యకట! వ్యర్థమ్ము గాదె?
ఏల సందియము ప♦రీక్షిన్నృపాలుండు
గాథ చెవులు సోఁకఁ ♦ గానె ముక్తి

వడసెఁ బ్రబలసాక్షి ♦ వాఁడె ముంజెయి కంక
ణమున కద్దమేల ♦ సుమతులార! 120

కంఠేరవుఁడైనఁ గడును
తక్కంఠ శుకేరిత కథా సు♦ధా సారమ్ముం
గంఠస్థము చేసిన వై
కుంఠమ్మున కతఁడు ప్రభువ♦గు నిక్కముగన్. 121

అమలంబుం బరమాతి గుహ్యమురు సి♦ద్ధాంత చ్ఛటాసుప్రసి
ద్ధము విన్పించితి నర్థి సర్వవిధ శా♦స్త్రంబుల్ విలోకించి పూ
ర్ణముగా, దీనికి మిన్న లేదు ధరలో♦నన్ ద్వాదశస్కంధ సా
రము నింతైనను ద్రావుఁడాపరసుఖా♦ర్థంబో మనుష్యాగ్రణుల్.

దీని నెవండు వైష్ణవ సు♦క్షేతతికిన్ వినిపించుచుండునో?
దీని నెవండు నేమముగఁ ♦ దీయని భక్తిని నాలకించునో?
యానరవర్యుఁ డాత్మవిధి ♦ నాదటఁ జేయు ఫలంబుఁ బొందెడి
న్గానమిలన్ యథార్థ కథ♦నంబున కన్న నసాధ్య కార్యముల్.

అని శ్రీ సూత పౌరాణికాగ్రేసరుండు శౌనకాది మహా
ర్షులకు శ్రీ భాగవత మహిమమును బ్రబోధించెను. 124

చెలఁగి వికృతి వత్సర మార్గ ♦ శీర్ష కృష్ణ
నవమి నిశిని సంకల్పించి ♦ నాఁడ దశమి
మొదలిడితి వ్రాయ నొక మాస♦మున కె పూర్తి
గా రచింపించె స్వామి భా♦గవత మహిమ. 125

మంగళము జగత్పతికిన్
మంగళము చరాచరైక ♦ మంజుల గతికిన్

మంగళ మఖిలోన్నతికిఁ
మంగళము హరిహరనాథ ♦ మహితాకృతికిఁ. 126

స్వర్ణత్వ క్పరిధాన దీప్త జఠరాం ♦ చత్సర్వ ధాత్రండ సం
పూర్ణా కీర్ణ పవిత్ర నిర్మలయశః ♦ పూరా మహోదార శ్రీ
రార్ణోరాశి మహీధ్ర సంతత నివా♦సా! వాసవా బ్జాసనా
భ్యర్ణైశ్వర్య విచిత్ర చర్య బుధ కా♦ర్యార్థాగ్రహీతాకృతీ!
నిష్కల వసుధా జల శో
చిష్కేశ మరున్నభో వి♦సృత్వర వీర్యా
విష్కృత సత్తాస్ఫూర్తీ!
విష్కిర వృషభాధిపాంస ♦ విహృతి విలోలా! 128

మాలిని॥ పినము దమరపాలా! ♦ వేదమార్గానుకూలా!
దనుజమద విభంగా! ♦ తార్క్ష్యగోరాట్తురంగా!
మునిజననుతపాదా! ♦ బోధలీలావినోదా!
జనకగిరిసుతేశా! ♦ సర్వవిశ్వప్రకాశా! 129

ఇది శ్రీ భగవదనుగ్రహలబ్ధ కవితా చరిత్ర శ్రీవత్ససగోత్రపవిత్ర
మిన్నికంటి వంశాంబుధి తారాకళత్ర పేరనామాత్యపౌత్ర
సుబ్బమాంబా లక్ష్మణమంత్రిపుత్ర ఉభయభాషాప్రవీణ
వేదాంతపారీణ గు రు నా థ శ ర్మ ప్రణీతంబైన
శ్రీ భాగవత మహిమము షష్ఠాధ్యాయము
స ర్వ ము సం పూ ర్ణ ము.

హరిహరనాథార్పణమస్తు.

# శ్రీమద్భాగవత మహిమ.

## శుద్ధపత్రము.

| పేజీ - పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|
| 4 – 18 | అరేయి | అత్రేయి |
| 8 – 2 | ఘాతము | బూతము |
| 10 – 22 | సీంద్రములు | సీంహములు |
| 14 – 2 | ప్రవేసాలు | ప్రవేసాల |
| 16 – 4 | య్యైవ | య్యైన |
| 18 – 2 | యచ్చుట | యిచ్చుట |
| 4 | వచ్చితినయ్యా బ్రహ్మఋషివర్య | వచ్చితి నింతకుఁ దేటికొనర |
| 30 – 8 | నెక్కొండైవ॥ | నుక్కొఁడెవఁడు॥ |
| 38 – 3 | వ్యక్తులకుఁ గష్టసుఖములు | వ్యక్తుల జరనిదుర తొలఁగు |
| 4 | భక్తి వలనఁ గలుగు | భక్తియు నెలమిఁ గను |
| 41 – 19 | భక్తి నారద సమాగమం | కుమార నారద సంవాదం |
| 43 – 10 | ఎచటి | ఎచట |
| 50 – 22 | గాడ్డ | గాడ్ఢ |
| 67 – 5 | అరసినాఁడ నీవు ప్రారబ్ధ | కాంచినాఁడ నీవు గతకర్మ |
| 70 – 14 | యఁ | యనఁ |
| 98 – 14 | బట్టినొకతె | బట్టియుండె |
| 106 – 20 | ట్పురుషు | ట్పురుషుం |
| 107 – 1 | నిర్భం | నిర్బం |
| 109 – 5 | స్కంధమునఁబడు | స్కంధమునఁ బడి యధ్యా<br>యములను దృతీయస్కంధ<br>మునం బడు |
| 110 – 7 | ధర్భ | దర్భ |
| 120 – 22 | రొాటె | రొాట్టె |
| 128 – 6 | తాండవింప | తనరుచుండ |
| 16 | పొందికే | పొందెనే |
| 135 – 19 | గడచిన | గడచన |